

# కాంగ్రెసుపై

[illegible]

కర్తలు :

[illegible]

## రామకుమారవర్మ



ప్రకాశకులు :

తెలుగుతోట



భాగం 2 వెల రు. 1—4—0

# కాంగ్రెసు పై కమ్యూనిష్టులకుట్ర


కర్తలు:

భూపతి కోటేశ్వరరావు

రామ కుమారవర్మ







ప్రకాశకులు:

తెలుగుతోట

వెల 1-4-0

## జోహారులు

స్వాతంత్ర్య సమరోత్సాహంలో సమసిపోయిన
స్వాతంత్ర్య యోధులకు, కష్ట నష్టాలకు
గురియయిన జాతీయవీరులకు.

ముద్రాపకులు
టాక్సు ముద్రాక్షరశాల,
రాజమండ్రి.
Q. H. E. G. 93 K. O. 1-3-46

# విషయసూచిక



# మనవి

సంవత్సరంకితం ఈ పుస్తకాన్ని ప్రచురించాం. మొదటి నెలలోనే 1000 కాపీలు అయిపోయాయి. కాపీలకొరకై డిమాండ్ రోజు రోజుకు ఎక్కువయింది! తెలుగులోగాని, ఇంగ్లీషులోగాని కమ్యూనిస్టుల పాలసీని ఇంత వివరంగా సునిశితముగా విమర్శించిన పుస్తకం మరొకటి లేనందున మరలఅచ్చు వేయించాలని నిర్ణయించుకున్నాము.

ద్వితీయముద్రణలో కొన్నిమార్పులుచేశాం. క్రొత్తగా కొన్ని వివరాలు స్వీకరించాం. ఎన్నికల కోలాహాలంలో ఈపుస్తకం కాంగ్రెసు వాదులకు ఎక్కువుగా ఉపయోగపడుతుందని ఆశిస్తూ ప్రచురిస్తున్నాము.

ప్రచురణలో ఎక్కువ కృషిచేసిన మిత్రులను గ్రంధి సత్తిరాజు, పేరా వుల్లయ్య, కొల్లి వీరవెంకన్నగార్లకు మా అభివందనాలు.

ఇట్లు,
భూపతి - వర్మ.

# సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన



1987, 1938, 1939 సంవత్సరాలలో భారత దేశంలో వర్గ సంఘాల అభివృద్ధి అత్యంతబలయుతంగా జరిగింది. కార్మిక కర్షక సంఘాలు దేశమంతా వెల్లివిరిసాయి. మామూలుగా, పెద్దపెద్ద రైల్వే కర్మాగారాల్లోను, బట్టల మిల్లులలోను, పని చేసేవారు చైతన్యయుతులుగా వుంటారు. కాని, ఈ చైతన్యము దేశమంతా ఆర్థిక, సాంఘిక నిర్మాణమంతటా ప్రాకింది.

చిల్లరపనులు చేసి జీవించే కష్టజీవులుకూడ తమప్రయోజనాలను సాధించుకోడానికి ఏకమయ్యారు. ఇదే విధంగా, రైతుల్లోను వర్గచైతన్యం ప్రబలింది. భూస్వాములను వడ్డీవ్యాపారస్తులను, ప్రభుత్వాన్ని రైతు ధిక్కరించడానికి తయారయ్యాడు.

ఈ పోరాటాల ఫలితముగా కూలీలకు, రైతులకుగొప్ప ఆర్థిక ప్రయోజనాలు కలుగనిమాట వాస్తవమేకాని, వారిలో పోరాటచైతన్యము వృద్ధిచెందింది, ఐక్యమత్యం ఏర్పడింది. కుల, మత, తత్వములను అరికట్టబడింది.

భూపతి

# జాతీయోద్యమం---

# కమ్యూనిస్టులు.

౧

భారత కమ్యూనిస్టులు, భారత జాతీయ కాంగ్రెసుకు పూర్తిగా వ్యతిరేకమయిన కార్యక్రమంతో పనిచేస్తూవచ్చారు. జాతీయ కాంగ్రెసుయొక్క కార్యక్రమానికి, భారత కమ్యూనిస్టులయొక్క కార్యక్రమానికి ఎలాంటిపొత్తూ, ఎన్నడూ లేదు. 'ఏం, కమ్యూనిస్టులుమాత్రము సామ్రాజ్య వ్యతిరేకులు కారా? వారు మాత్రం దేశభక్తులుకారా?' అని మీలో కొందరు సందేహించవచ్చును. ఈ ప్రశ్నలు 1942 ఆగస్టు 9 కి ముందు ఎవరయినా అడిగితే అర్థమేమయినా ఉన్న దేమోకాని, ఈనాడు ఇలాంటి ప్రశ్నలకు అవకాశము లేదు. కమ్యూనిస్టులు బ్రిటిషుసామ్రాజ్యానికి ఎలా పూర్తిమద్దతు చేస్తున్నారో మనకళ్ళకు కట్టినట్టు కన్పిస్తోంది. ఇలాంటివారు సామ్రాజ్య వ్యతిరేకులంటే ఏ మూర్ఖుడు నమ్ముతాడు? భారత ప్రజా స్వాతంత్ర్య పోరాటంలో (1942) వారు ఏపాత్ర ధరించారు? దేశభక్తులు స్వాతంత్ర్యపోరాటంలో అసువుల్ని అర్పిస్తూవుంటే, కమ్యూనిస్టులు ప్రభుత్వమునకు అన్నివిధాల తోడ్పడుతూ, స్వవినాశకరచర్యలు మానండని ప్రజలలో

విపరీత ప్రచారం చేశారు. మద్రాసు గోఖలే హాలులో ఉపన్య సిస్తూ ఫోరం పత్రికా సంపాదకులు జోకిం ఆల్వాగారన్నట్లుగా కమ్యూనిస్టులు ఖాకీదుస్తులు ధరించలేదుగాని పోలీసులకు గూఢచారులుగా పనిచేశారని చెప్పుటకు ప్రబలమైన ఆధారము లున్నాయి. శ్రీ యస్. కె. పటేల్‌గారన్నట్లుగా కాంగ్రెసును వెన్నుపోటు పొడవడానికి యత్నించారు. ఇదంతా దేశభక్తులు చేయవలసిన కార్యక్రమమేనా? ఇలాంటివీరి కార్యక్రమానికీ, జాతీయ కాంగ్రెసు కార్యక్రమానికీ, నక్కకు నాగలోకాని కున్నంత దూరమున్నది.

ప్రభుత్వము, కమ్యూనిస్టులు, కాంగ్రెసు.

అంతేకాదు, ప్రస్తుత కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలు, వారిని ప్రభుత్వ అనుగ్రహా నికి పాత్రుల్ని చేసాయి. ఎలాగో చూడండి. ఇదివరకటినుండి నిషేధించబడి, రహస్యంగా, పనిచేస్తున్న కమ్యూనిస్టుపార్టీపై ప్రభుత్వం నిషేధం తొలగించి వేసింది. ఈ కమ్యూనిస్టుపార్టీ సక్రమసంస్థగా పనిచేయడానికి ప్రభుత్వం అవకాశం ఇచ్చింది. కమ్యూనిస్టుపార్టీ నాయకులు పి. సి. జోషీ, జి. అధికారి, సుందరయ్య ము [illegible]గువారు గత మూడు సంవత్సరాలనుండి పోలీసులకు పట్టు[illegible]కుండా తప్పిం చుకు తిరుగుతున్నా, ప్రభుత్వం వారంట్లు రద్దు చేసుకుని వారు కమ్యూనిస్టుపార్టీ ప్రచారాన్ని సాగించుకోడా[illegible]కి పూర్తి అవ కాశాన్నిచ్చింది. జైళ్ళలోవున్న కమ్యూనిస్టుల[illegible] విడుదల చేసిం

డి. కమ్యూనిస్టుపార్టీ పత్రికలపై నిషేధం తొలగించింది. కొత్త పత్రికలు పెట్టుకోడానికి అవకాశ మిచ్చింది. సభలు, సమావేశాలు జరుపుకోడానికి ప్రోత్సాహమిచ్చింది. (వారి సమావేశాల్ని ప్రభుత్వంవారు పిల్మ్రతీసి ప్రచారం చేస్తున్నారు.) ఒక్క మాటలో చెప్పాలంటే, ఇదివరకు వారిని వెన్నంటిన ప్రభుత్వం, నేడు వారివెన్ను కాస్తోంది.

**మారిం దెవరు?**

ఎంతలో ఎంతమార్పు! బ్రిటిషు సామ్రాజ్య వాదులలోనా? కమ్యూనిస్టుల లోనా? వారిలో ఎవరు ఎవరి పంథాను స్వీకరించారు? ఎవరిస్వభావంలో మార్పు వచ్చింది? యుద్ధస్వభావంలో మార్పు వచ్చిందంటారు కమ్యూనిస్టులు. సామ్రాజ్యవాదులు మొదటినుండీ ధర్మయుద్ధాన్నే చేస్తున్నామని చెప్పుతూవచ్చారు. రష్యా ప్రవేశంతోనే ధర్మయుద్ధ మయిందని రష్యా - జర్మనీయుద్ధం ప్రారంభమయిన ఆరునెలలకు ఇండియన్ కమ్యూనిస్టులు ప్లేటు ఫిరాయించారు. అయినప్పుడు కమ్యూనిస్టుల స్వభావాల్లోనే మార్పు వచ్చిందని స్పష్టపడుటలేదా? సామ్రాజ్యవాదుల్లో మార్పు లేదు. కమ్యూనిస్టుల స్వభావాల్లోనే మార్పు వచ్చింది. అందువల్లనే ప్రభుత్వ అనుగ్రహానికి పాత్రులయినారు.

ఇదే సమయంలో కాంగ్రెసు రాజకీయాలు ఎలా వున్నాయి. కాంగ్రెసు పట్ల ప్రభుత్వం వైఖరి ఎలావున్నది?

1942 ఆగస్టు 9 వ తేదీన జాతీయనాయకులు అరెస్టు చేయబడ్డారు. ఆయారాష్ట్రాలలోని కాంగ్రెసు నాయకుల్ని ప్రభుత్వము అరెస్టు చేసింది. అఖిలభారత జాతీయ కాంగ్రెసుపై ప్రభుత్వం ఆంక్ష విధించింది. కాంగ్రెసు పత్రికలను ప్రభుత్వము నిషేధించింది. కాంగ్రెసు సభలను, సమావేశాలను ప్రభుత్వము సాయుధ సైన్యాలను ప్రయోగించి చెదరగొట్ట యత్నించింది.

ఆగస్టు 9 వ తేదీన బొంబాయిలో కీ. శే. కస్తూరిబా గాంధి ఉపన్యసించ దలిస్తే అరెస్టుచేసి, ప్రజలపై పోలీసులు తుపాకుల్ని కాల్చారు. అదే సమయంలో బొంబాయిలో పారెల్ ప్రాంతంలో ప్రభుత్వ అనుమతితో కమ్యూనిస్టులు సభలు జరుపుకొని ప్రజలను తమ జాతీయ కర్తవ్యాన్నుండి మరల్చి, సామ్రాజ్య అనుకూలురుగా చేద్దామని ప్రయత్నించారు. చూశారా? కాంగ్రెసుకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు ప్రభుత్వానికి ఎలా ఉపయోగపడ్డారో! జాతీయనాయకులను అరెస్టుచేసి నందులకు కార్మికులు సమ్మెలు చేస్తూవుంటే, కమ్యూనిస్టులు ఆ సమ్మెలను చెడగొట్టడానికి ప్రబల ప్రయత్నాలు చేసినారు. ఇలాగే విద్యార్థుల్లోకూడ తమ జాతీయ విద్రోహ ప్రచారాన్ని జరుపుతూ వచ్చారు. జాతీయ నాయకులకు వ్యతిరేకమైన కార్యక్రమంతో పనిచేస్తూ, కాంగ్రెసు ప్రతిష్ఠను మంటగలుపుటకు యత్నిస్తూ, కాంగ్రెసుకు శత్రువు లయినవారితో చేతులు కలిపారు. ఒక్కమాటలో చెప్పా

లంటే ఆగస్టు తీర్మానానికి వ్యతిరేకంగా పనిచేస్తున్నారు. కాంగ్రెసునాయకులు జైళ్ళలో వుంటే, కమ్యూనిస్టులు కావలసినంత స్వేచ్ఛను అనుభవిస్తున్నారు. జాతీయ పోరాటాలు సాగుతున్న సమయంలో ఎలాంటివారి ప్రచారానికి అడ్డంకులు వుండవో వేరే చెప్పాలా? సామ్రాజ్యవాదులు జాతీయవిద్రోహులకు బోలెడంత స్వాతంత్ర్యం ఇస్తారుకదా! జాతీయ వాదుల్ని ఇనుప కమ్మలమధ్య ఇరికిస్తారు కూడా! 'చేసుకున్న వారికి చేసుకున్నంత'! ఒకరిని అనేపనేమున్నది? కాంగ్రెసుకూ, కమ్యూనిస్టులకు ఇంత వ్యత్యాసమున్నది.

**జాతీయోద్యమమూ— కమ్యూనిస్టులు**

(కమ్యూనిస్టులు—కాంగ్రెసు 5 పేజి ప్రజాశక్తి ప్రచురణ నెం 82) లో ఇలా వున్నది.

"భారత జాతీయతకూ, కమ్యూనిజానికీ మధ్య పొసగే ఏకాభిప్రాయం ఏదీ లేదనేవారు, విషయాలు తెలియనివారైనా అయి ఉండాలి. లేదా ఇటీవలి భారత జాతీయ చరిత్రను అబద్ధాలతో కప్పి పుచ్చుతూనైనా ఉండాలి" అంటున్నాడు. పి. సి. జోషి.

ఎవరు విషయాలు తెలియనివారో, జాతీయచరిత్రను అబద్ధాలతో కప్పి పుచ్చేవారో, గమనిద్దాం. భారత జాతీయోద్యమాన్ని, పి. సి. జోషీ అండ్ కో వారు మొదటి నుండికూడ ఎలా ప్రతిఘటిస్తూ వచ్చారో తెలుసుకుంటే, వారి బండారం బయట పడుతుంది.

1930–32 స్వాతంత్ర్య పోరాటం పట్ల కమ్యూనిస్టుల వైఖరి ఎలాంటిదో గమనిస్తే ఈ విషయం రుజువుకాకమానదు. కాంగ్రెసు ప్రారంభించిన ఏ స్వాతంత్ర్య పోరాటంలోనూ కమ్యూనిస్టులు పాల్గొనలేదు. పైపెచ్చు వ్యతిరేకిస్తూవచ్చారు. కాంగ్రెసు నాయకత్వం బూర్జువానాయకత్వమనియు, సంస్కరణ నాయకత్వమనియూ, పేర్లుపెట్టి, కాంగ్రెసు పలుకుబడిని తగ్గించడానికి ప్రబలమైన ప్రయత్నాలు చేసారు. జెండాసత్యాగ్రహం రోజుల్లో కాంగ్రెసు దేశభక్తులు మనజాతీయ ఆత్మగౌరవాన్ని మన జాతీయ ప్రతిష్టనుజగజ్జేగీయమానంగా ప్రజ్వలింప జేయడానికి లాఠీదెబ్బలకు, తుపాకిగుండ్లకు, గురి అయి త్రివర్ణపతాకాన్ని భారతీయ పట్టణాల్లో, పల్లెల్లో, ధీమాతో ఎగురవేస్తున్న రోజుల్లో కమ్యూనిస్టులు నల్లజెండాలతో ప్రత్యక్షమయి జాతీయ జెండాపట్ల తమవైమనస్యాన్ని ప్రదర్శించారు. జాతీయ నాయకులకు నల్లజెండాలు ప్రదర్శించారు. ఈ రోజుల్లోనే బొంబాయిలో అమాయకులును నిరక్షరకుక్షులు అయిన కార్మికులను రెచ్చగొట్టి గాంధీజీ విగ్రహాన్ని వికృతంగా తయారుచేసి తగులబెట్టించారు. కాంగ్రెసును మటుమాయం చేయాలని బాహాటంగానే ప్రచారం చేశారు. వీరు ముఖ్యంగా కార్మికులను కాంగ్రెసుపై రెచ్చగొట్టడానికి ప్రయత్నంచేశారు. 1930 వ సంవత్సరంలో కాంగ్రెసు సాగించిన శాసనోల్లంఘన మంలో కమ్యూనిస్టులు కాంగ్రెసును బలపర్చలేదని పైన చెప్పాం. అంతేకాదు, తమ పలుకుబడిలోనున్న కార్మికుల్ని

శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనవద్దని చెప్పారు. కాంగ్రెసు నాయకులను జాతీయ సంస్కరణ వాదులని నిందించారు, కాంగ్రెసు నాయకత్వమునకు జాతీయ బూర్జువా నాయకత్వమని పేరుపెట్టినారు. నాయకత్వం వహించి నడిపిస్తున్న శాసనోల్లంఘన పద్ధతిని తీవ్రంగా వ్యతిరేకించారు. కనీసము, జాతీయశక్తులతో సానుభూతి చూపెట్టుతూ కార్మికులు రాజకీయంగా ప్రదర్శనాలుకూడ చేయకుండా చేశారు. అంతేకాదు, కాంగ్రెసు సాగించిన శాసనోల్లంఘనము విప్లవోద్యమము కాదనియు, కాంగ్రెసు బూర్జువావర్గపార్టీ అనియు విమర్శించారు.

ఇలాంటి కార్యక్రమంతో పనిచేసి వీరు సాధించగలిగిందేమి? జాతీయ శక్తులను పూర్తిగా దూరం చేసుకున్నారు. కాంగ్రెసువాదులు వీరిని ద్రోహులుగా భావించారు. దీనిఫలితం, కమ్యూనిస్టులు పూర్తిగా బలహీనపడ్డారు. బానిసదేశాల్లోని స్వాతంత్ర్యోద్యమాలను వ్యతిరేకించి, ఆకుకులందనిపోకకు పొందని నినాదాలతో కమ్యూనిస్టులు వరగబెట్టిందేమి? బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి సహాయపడ్డారు. జాతీయపోరాటాన్ని వ్యతిరేకించడమంటే సామ్రాజ్యవాదులకు సహాయము చేయుడము కాదా మరి?

1935 సం. వరకు కమ్యూనిస్టులు బాహాటంగానే కాంగ్రెసు వ్యతిరేక కార్యక్రమంతో పని చేసారు. 1935 నుండి కాంగ్రెసుతోకూడ చేతులు కలిపి సామ్రాజ్యవ్యతిరేక ఐక్య సంఘటన నిర్మించాలని నిర్ణయించుకున్నారు.

అయితే, ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని మనం మనస్సులో ఉంచుకోవాలి. కమ్యూనిస్టులు ఇలా తమ పాలసీని ఎందువల్ల మార్చుకోవలసి వచ్చిందో చూద్దాం. వారు మంచి, చెడ్డ ఆలోచించి, దేశకాల పరిస్థితులకు అనుగుణ్యంగా అలా మార్చుకున్నారా? లేక మరేమయినా కారణం ఉన్నదా?

1928 సం. లో కమ్యూనిస్టులు ఇంటర్ నేషనల్ ఆరవ కాంగ్రెసు సమావేశ మయింది. ఆ సమావేశంలో వలస దేశాల కమ్యూనిస్టులు అవలంబించవలసిన రాజకీయపాలసీ తయారు చేయబడింది. ఆ పాలసీ ప్రకారం కాంగ్రెసు బూర్జువావర్గపార్టీ అనీ, విప్లవ వ్యతిరేకసంస్థగా, ప్రచారంచేస్తూ కాంగ్రెసుపై ధ్వజమెత్తారు. 1933 సంవత్సరంలో బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీ, జర్మన్ కమ్యూనిస్టుపార్టీలు వ్రాసిన లేఖలు, 7 వ అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభ నిర్ణయాలు, భారత కమ్యూనిస్టుల వైఖరిలో తలక్రిందులుగా మార్పును తీసుకునివచ్చినాయి. అప్పటినుండి కాంగ్రెసులో యునైటెడ్ ఫ్రంటు అంటూ నినాదాలు వినవచ్చాయి. ఇదివరకులా కాంగ్రెసు బూర్జువావర్గ పార్టీ అనడం మానేసి, కాంగ్రెసు నాయకత్వం బూర్జువావర్గం అని ప్రచారం చేయడం ప్రారంభించారు.

విజాతీయత

1928 సం॥ నుండి 1935 సం॥ వరకు పూర్తిగా 8 సంవత్సరాలు కాంగ్రెసు వ్యతిరేక కార్యక్రమంలో బాహాటంగానే పని చేసారు. విజాతీయ సంస్థమాత్రమే భారత ప్రజావాణిని వ్యక్తపర్చగలదో, సామ్రాజ్యవాదులను ఢీకొని స్వాతంత్ర్య పోరాటాన్ని సారథ్యం వహించగలదో అలాంటి జాతీయ కాంగ్రెసును విచ్ఛిన్నం చేయడానికి కమ్యూనిస్టులు ప్రయత్నించారంటే వారెలా జాతీ యోద్యమాన్ని వ్యతిరేకించారో గమనించాం, పోనీ, 8 సం॥ అయిపోయాక తమంతట తాము తమ అనుభవాల్ని పురస్కరించుకొని, తమ వైఖరిని మార్చుకున్నారా అంటే అదీ కాదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీ 7 వ సమావేశం నిర్ణయం తయారుచేసి వారికి పంపితే వారు దానిని అమలుజరుపడానికి మాత్రమే యంత్రంలాగ పనిచేస్తున్నారు

భారత కమ్యూనిస్టులు ఇలా రెడీమేడ్ పాలసీలను దిగుమతి చేసుకుని ఒక ఏజెన్సీలాగానే పనిచేస్తున్నారని స్పష్టపడుట లేదా? భారత కమ్యూనిస్టులు మన జాతీయ పరిస్థితులకు అనుగుణ్యంగా తమ పాలసీలను నిర్ణయించుకోకుండా విదేశాల సభల్లో నిర్ణయింపబడిన పాలసీలను మన దేశంలో చిలక పలుకులు పలకడం హాస్యాస్పదం? అంచేతనే వీరి కార్యక్రమమంతా జాతీయ పరిస్థితులకు విరుద్ధంగా వుంటున్నది. ఇలాంటి పద్ధతి 'కమ్యూనిజం' అవుతుందా? లేక 'అంతర్జాతీయత'నే

ముద్దుపేరు తగిలిస్తారా? 'విశాల దృక్పథమని ఉవ్విళ్ళూరుతారా?

ఇలా రెడీమేడ్ పాలసీలను విదేశాలనుండి దిగుమతి చేసుకుని వ్యవహరించటమే విదేశ రాజకీయాలతో వ్యవహరించడమే అవుతుంది. అంచేతనే, కమ్యూనిస్టుల రాజకీయాలు విజాతీయ రాజకీయాలని నిర్వచించడం సరిపోతుంది.

అది బ్రిటిషు జాతీయత కావచ్చు. రష్యన్ జాతీయత కావచ్చు. ఏదయినా విజాతీయతే. మన జాతీయోద్యమంలో పుట్టిపెరిగిన వారికి విదేశీ వస్తువుల్ని బహిష్కరించాలని బాగా తెలుసు. అంచేతనే కమ్యూనిస్టుల విజాతీ పాలసీని మన ప్రజలంతా బాయ్‌కాట్ చేస్తున్నారు.




ఇలా వీరు కాంగ్రెసులో 'యునైటెడ్ ఫ్రంటూ' అంటూ కాంగ్రెసులో చేరారు. ఇంతమాత్రాన కాంగ్రెసును బలపరచుటకు పూనుకొన్నారని భ్రమపడకండి. ఇలా వీరు కాంగ్రెసులో చేరడం కూడ కాంగ్రెసు వ్యతిరేక కార్యక్రమాన్ని సాగించడానికి అవుసరమనే ఉద్దేశంతోనే. కాంగ్రెసును బలహీన పరచే కార్యక్రమంలో ఒక భాగంగానే.

కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులో ఒక పార్టీగా లేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభ నిర్ణయాల ప్రకారం పార్టీ ఏ ఇతర వర్గసంస్థలతో మిళితమై కాని, ఒక భాగంగా

కాని ఏర్పడి పనిచేయకూడదు. కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గ పార్టీగానే స్వతంత్ర రాజకీయ నినాదాలతో పనిచేయాలి. అంతేగాని వీరు కాంగ్రెసును బలపరుస్తూ తాముకూడ బలుపడుట సంభవించదు. వారు కాంగ్రెసులో తమ పార్టీ నాయకత్వాన్ని స్థాపించుకోవడమే పరమావధిగా పెట్టుకొని పనిచేస్తున్నారు. దానికోసం, వారు కాంగ్రెసు నాయకత్వం ప్రజాపోరాటాన్ని విజయ ప్రదంగా సాగించలేదని ప్రచారం చేసారు. తాము మాత్రమే ప్రజాపోరాటాన్ని సాగించగలమని ఘంటాపథంగా చెప్పారు. ఇదంతా కాంగ్రెసు నాయకత్వంపై దెబ్బతీయ టానికి ప్రయత్నమే. ఇలా కాంగ్రెసు ప్రజాసామాన్యాన్ని కాంగ్రెసు నాయకత్వంనుండి దూరంచేసి తాము ఆస్థానాలు ఆక్రమించుకోవాలని వీరి ఎత్తుగడ. అందువల్ల కాంగ్రెసుతో "యునైటెడ్ ఫ్రంటు" అను కమ్యూనిస్టుల వాదం చాలా ద్రోహప్రేరిత మయినది.




అసలు కాంగ్రెసు ప్రాముఖ్యతను తగ్గించి వేయడానికికూడా ఇదివీరికి ఉపయోగ పడుతుంది.

భారత జాతీయ కాంగ్రెసు అన్నివర్గాల ప్రాతినిధ్యం వహించి పనిచేస్తున్న జాతీయసంస్థ. అది స్వాతంత్ర్యంకొరకు సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా హోరాహోరిగా పోరాటం సాగించుతుంది. అంతే, మన జాతీయ

కాంగ్రెసే స్వాతంత్ర్య కాములందరియొక్క సామ్రాజ్యవాద వ్యతిరేకు లందరియొక్క జాతి, మత, శాఖ, వర్ణ, వర్గ విచక్షణ లేకుండా ప్రాతినిధ్యం వహించి పనిచేస్తున్నది. అయినప్పుడు కమ్యూనిస్టులు వేరే కాంగ్రెసు వెలుపల ప్రత్యేకమైన పార్టీగా స్వతంత్ర రాజకీయ నినాదాలతో కార్మికవర్గ నాయకత్వం వహిస్తున్నామని చెప్పుకుంటూ, కాంగ్రెసుతో "యునైటెడ్ ఫ్రంటు" అని చెప్పడం కాంగ్రెసు, కమ్యూనిస్టుల కలయిక సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనను పూర్తిచేస్తుందని ప్రచారం చేయడానికి ప్రయత్నించడమే.

కార్మికవర్గ నాయకత్వానికి పన్నాగాలు

(యుద్ధము-వివిధపార్టీల నిజస్వరూపము. పేజీ 65 లో యిలావున్నది.

ఇలా చేయడమంటే జాతీయ కాంగ్రెసును కార్మికులనుండి దూరం చేయడానికి యత్నిస్తూ, తాము వారికి నాయకత్వం వహించడానికి పన్నాగాలు పన్నుతూ, కాంగ్రెసు నాయకత్వం బూర్జువా నాయకత్వమని రుజువు చేయడానికి ప్రయత్నించడమేనని స్పష్టపడుతున్నది. కాంగ్రెసు మంత్రివర్గాలున్న రోజుల్లో కమ్యూనిస్టులు సమ్మెలను ప్రోత్సాహపరచి, కార్మికులను కాంగ్రెసుమంత్రులకు వ్యతిరేకంగా రెచ్చగొట్టి, కాంగ్రెసునుండి కార్మికుల్ని దూరం చేయడానికి ప్రయత్నించారు. కాంగ్రెసు మంత్రుల్ని దుమ్మెత్తి పోశారు? తూర్పారబట్టారు.

(యుద్ధము - వివిధపార్టీల నిజస్వరూపము - గాంధీ వాదం జి అధికారి పేజీ 38)

కమ్యూనిస్టులమభ్యాషితాలు - గాంధి వాదంపై సవాలు.

ఈ సందర్భంలో కమ్యూనిస్టు ప్రముఖుల భావాలు ఎలా వారు తమ సారస్వతంలో విశదీకరించారో గమనిద్దాం.

"భారత రాజకీయ అభివృద్ధి నూతనదశకు వచ్చింది. ఈ దశలో కార్మికవర్గం సంఘీ కృతబలాన్ని సంపాదించి, రాజకీయ చైతన్యంపొంది జాతీయోద్యమంలో బూర్జువా నాయకత్వాన్ని సవాలుచేసే స్థితికి వచ్చింది."

కమ్యూనిస్టులు కాంగ్రెసుతో యునైటెడ్ ఫ్రంటు, అంతరార్థాన్ని వివరిస్తు వ్రాసిన వాక్యాలు, మిష్టరు జి. అధికారి బలపరుస్తున్నట్లు సువిదితమే. ఇదంతా కాంగ్రెసు నాయకత్వంపై కమ్యూనిస్టుల కుట్రను బట్టబయలు చేస్తుంది. అంటే కాంగ్రెసులో సంయుక్త సంఘటన పేరుతో కాంగ్రెసు నాయకత్వాన్ని సవాల్ చేసి, తమ నాయకత్వాం స్థాపించుకోడమే పరమావధని వారే చెప్పుకుంటున్నారని తెలుతోంది.

కార్మికవర్గ నాయకత్వం-కమ్యూనిస్టులు గొంతెమ్మ కోర్కెలు

అంతేకాదు, గాంధీవాదం అను తన వ్యాసంలో పాపం! జి. అధికారి, ఎలా తన గొంతెమ్మ కోర్కెను మాటల్లో సఫలీకృతం చేసుకున్నాడో చూడండి. "ఈపోరాటం నుంచే ఒకవైపున జాతీయ పోరాట రంగంలోకి క్రియంగా

ప్రాముఖ్యత వహించుతోన్న కార్మిక వర్గ రాజకీయ నాయకత్వం (అంటే, తమనాయకత్వం) ముందుకొచ్చింది. మరో వైపున గాంధీజం జాతీయపోరాటరంగంలో వెనుకంజవేస్తూ, నీరసస్థితిలోకి, అఖరు దశలోకి పోసాగింది.

**జాతీయోద్యమంలో అఖరుస్థితి**

మిష్టరు అధికారి ఎంతో ఉబలాటపడుతూ 1940 లో ఆమాటలు వ్రాసాడు. కాని, నేడు పి. సి. జోషి కమ్యూనిస్టులు - కాంగ్రెసు అను తనవ్యాసంలో "కాంగ్రెసు పెద్దలు హఠాత్తుగా, వివరాలను వివరించే అవకాశం కూడా మాకు ఇవ్వకుండా, కాంగ్రెసునుండి తొలగించుతున్నారు. వారిముందు వినమ్రులమై చేతులుజోడ్చి, మేం ప్రార్థించేదేమంటే" అంటూ వాపోతున్నాడు. (పేజీ 4)

జాతీయోద్యమంలో ఎవరు అఖరు స్థితిలో నున్నారో సిథిలావస్థలో నున్నారో ఈ సరికి మిష్టరు అధికారి జోషీనుండి నేర్చుకొనే వుండాలి. ఏమి కాలవైపరీత్యం!

---

౨

# యుద్ధము - కమ్యూనిస్టులు - కాంగ్రెసు

1939 సం॥ లో యుద్ధం ప్రారంభమయ్యింది. కమ్యూనిస్టులేమన్నారో గుర్తుకు తెచ్చుకుందాం.

"1939 సంవత్సరం 1914 కాదు. రెండవ సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభం కావడంతోనే ప్రపంచమంతటా విప్లవాలు వచ్చే సమయం ఆసన్నమయింది. మొదటి సామ్రాజ్యవాదయుద్ధం అనుభవం వలన, గత ఇరువై సంవత్సరాలనుండి, ముఖ్యంగా 1932 నుంచీ కమ్యూనిస్టు పార్టీ గావించిన యుద్ధ వ్యతిరేక ప్రచారం వలన 'మాతృదేశ రక్షణ' అను ప్రచారం లోని దగాను ఎల్లప్పుడు స్పష్టంగా బైట పెట్టుటచే ప్రపంచమంతటా యుద్ధం మొడలను యుద్ధ ప్రోత్సాహకుల మొడలను తీవ్రమైన ద్వేషం, అసహ్యత వ్యాపించింది. మరియూ, యుద్ధం వాస్తవంగా ప్రారంభమైన ఇప్పుడు, 1914 లో వలె సామ్రాజ్యవాదులకు ప్రజలను మోసపుచ్చుట సులభం, కాదు. వెనుకటి సారివలె సంవత్సరాల తరబడి యుద్ధం తరువాతగాక, ఇప్పుడు యుద్ధం ప్రారంభమైనప్పటినుంచి, యుద్ధ వ్యతిరేక ఉద్యమం సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమాలు బలబడుతున్నాయి. అందుచే క్రిందటి యుద్ధంలోకంటె ఈసారి బ్రహ్మాండ మయినట్టియు, ఉన్నతమయినట్టియు ప్రపంచ విప్లవాలవెల్లువ లేస్తుంది.

అందుచే రెండవ సామ్రాజ్యవాద యుద్ధం విప్లవశక్తులు ఇదివరకెన్నడు లేనంత బలప్రదంగా వున్న సమయంలో ప్రారంభమయ్యింది. ప్రపంచ పెట్టుబడిదారీ విధానం ఇదివరకే తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో చిక్కుకొనివుంది. ప్రజాసామాన్యం ఇదివరకే యుద్ధ ప్రోత్సాహకులగు సామ్రాజ్య వాదులపై తీవ్రమైన ద్వేషం అసహ్యత కలిగివున్నారు. యుద్ధ సంక్షోభం తీవ్రమైన కొలదీ, ఆర్థిక దుస్థితి హెచ్చినకొలది, దారుణ ప్రజా మారణహోమం భీకరమైనకొలది ఈ ద్వేష అసహ్యతలు విప్లవోత్సాహంగా మారతాయి. శాంతి కావాలను ఆవేదన అణచ నశక్యమౌతుంది. యుద్ధ ప్రోత్సాహకులగు సామ్రాజ్య వాదులు ప్రజలకు దూరమైపోతారు. ఆవిధంగా యుద్ధప్రోత్సాహకులగు ఫాసిస్టులకు, సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ప్రజాఐక్యత ఏర్పడి విప్లవ సంఘటన సాధ్యమౌతుంది. త్వరలో యుద్ధాన్ని అంతమొందించి శాంతి, ప్రజాస్వామికం, సోషలిజం ప్రపంచమంతటా జయం పొందడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈ నూతన యుద్ధకాలపు ప్రభావమది. అవకాశాలవి. యుద్ధకాలపు. ఈఅవకాశాలను దృష్టిలో ఉంచుకొనే "కమ్యూనిస్టుపార్టీలు ప్రవర్తిస్తాయి" ఈ మాటల డాబుసరి బండారం తర్వాత బయటపడింది.

**యుద్ధము - కాంగ్రెసు**

ఇదే సమయంలో కాంగ్రెసు ఏమి చెప్పిందో గుర్తుకు తెచ్చుకుంటాం.

భారతప్రజలను సంప్రదించకుండానే భారతదేశాన్ని బ్రిటను యుద్ధంలో దింపింది.

ప్రజాస్వామికం, స్వాతంత్ర్యం, ఆశయాలుగా పెట్టుకొని బ్రిటిషువారు యుద్ధం చేస్తున్నామంటున్నారు. అయితే ఆ మహదాశయాలను మా దేశానికి ప్రస్తుతం ఎలా వర్తింప చేస్తారో దయచేసి తెలియపర్చండి. పోలండుపట్ల మాకు సానుభూతివున్నది. కాని, బానిసలుగా ఉండి మేము పోలండుకు సహాయము చేయలేనిస్థితిలో వున్నందుకు విచారిస్తున్నాము.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు తమ యుద్ధ ఆశయాలు భారతదేశానికి ఎలా వర్తింపచేస్తారో తెలియచేసి కాంగ్రెసును సంతృప్తి పరచలేక పోయారు.

దీంతో కాంగ్రెసు, యుద్ధస్వభావమును సామ్రాజ్యవాదుల నోటినుండే చెప్పించింది. ఆ విధంగా ఓర్పుతో ప్రజాభిప్రాయాన్ని కూడ గట్టుకు రావడానికి యత్నిస్తూ, స్వాతంత్ర్య శక్తులను బలపరుచుటకు ప్రయత్నం చేసింది.




కాంగ్రెసు మంత్రులు రాజీనామా పెట్టివేసారు. యుద్ధంతో మాకెట్టి నిమిత్తం లేదని ప్రకటించియున్నారు. అంతేకాదు. తాలిమితో జాతీయశక్తుల్ని బలపర్చుటకు కూడ ప్రయత్నాలు చేసారు. రాంఘర్ కాంగ్రెసులో పోరాటానికి పిలుపువచ్చింది. రాంఘర్ కాంగ్రెసులో జాతీయనాయకులు నిజమైన పోరాటానికి ఉపక్రమణిక తీర్మానాల్ని అంగీకరించారు. రాజేంద్రబాబు "మేము ప్రారంభించే పోరాటం

ప్రజాసామాన్యం పాల్గొనేదిగాను కాంగ్రెసువంటి గొప్పసంస్థ హోదాకు తగినట్టిదిగాను ఉంటుం" దన్నాడు. పండిత నెహ్రూ "పోరాట స్వభావ మిలావున్నా, గత వుద్యమాలన్నిటికంటే విస్తారమైనదిగాను, బ్రహ్మాండమైనదిగానూ, ప్రజా సామాన్యం పాల్గొనేదిగాను వుంటుంది." అన్నాడు. గాంధీజీకూడ 'తీర్మానంలో సమిష్టి శాసనోల్లంఘనం మాటే లేదనికొందరు ఆక్షేపిస్తే, ప్రజలు పాల్గొనే శాసనోల్లంఘనమే గాకపోతే నేను మీావద్దకు ఎందుకు రావాలి. కొలదిమంది వ్యక్తులతోనే జరిపేదయితే నేను మీాతో ఎందుకు వాదించాలి" అన్నారు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ తరఫున ఆచార్య నరేంద్రదేవ్ "తీర్మానం పోరాటానికి పిలుపు" అని సమర్థించాడు. కాని కమ్యూనిస్టులు యిదిపోరాటాన్ని వాయిదావేసి నిస్తబ్ధత కొనసాగించడానికి మరో ప్రయత్నమని వ్యక్తి సత్యాగ్రహాన్ని ఎదుర్కొన్నారు.

రాంఘర్ తీర్మానంలో "బ్రిటను ప్రధానంగా సామ్రాజ్యవాద ఆశయాలకోసం సామ్రాజ్య రక్షణకోసం యుద్ధం సాగించుతోంది అని వుంది.

మౌలానా ఆజద్, బ్రిటిషు సామ్రాజ్య వాదులు జయంపొందిి, సాంబాసినత్వం దీర్ఘం కావాలని మేము కోరజాలము" అన్నాడు తన అధ్యక్షోపన్యాసంలో. రాంఘర్ తీర్మానం భారతదేశ సంపత్తిని యుద్ధంలో బ్రిటిషువారు వినియోగించుకోవడాన్ని సహించమని స్పష్టంగా చెప్పింది.

కాంగ్రెసు కార్య దక్షత - కమ్యూనిస్టుల అవకతవకలు

ఇలా కాంగ్రెసు జాతీయ ధర్మాన్ని నెరవేరుస్తూ ఉంటే కమ్యూనిస్టులు, జాతీయ నాయకత్వంపై ఎలాంటి దుష్ప్రచారం చేసారో చూద్దాం.

జాతీయ పెట్టుబడి దారీవర్గానికి ప్రతినిధి అయిన కాంగ్రెసునాయకత్వం యుద్ధ అవకాశాన్ని సామ్రాజ్యవాదంనుండి సంస్కరణలు రాబట్టడానికి ప్రయత్నంతో వుంది. కనీసం ఫెడరల్ రాజ్యాంగవిధానాన్ని బుట్టదాఖలు చేసి ఇండియా గవర్నమెంటులో బాధ్యత ఇవ్వాలని అది సామ్రాజ్య వాదాన్ని కోరుతూవుంది. కాని జాతీయ నాయకత్వంతనలక్ష్యాన్ని పొందడానికి ప్రజాపోరాట ఆయుధాన్ని వినియోగించ కోరుట లేదు. అది బలహీనతను తెల్పుతోంది. ప్రజాపోరాటం ప్రమాదకరమైన మార్గాలు పడుతుందని ఎరుగును. నేడు 1930 32 నాటి కంటె విప్లవశక్తులు ఎంతోవృద్ధి పొందాయని, అవిప్రజలసత్యాగ్రహోద్యమాన్ని కూడ విప్లవోద్యమంగా మార్చ గలవనీ ఎరుగును. కాంగ్రెసుననుసరించు ప్రజలలోగాంధీవాదంపైయుక్క పలుకుబడి తగ్గిపోయిందని వారికి తెలుసు. ఒకసారి వదలితే పోరాటశక్తులు గాంధీవాదపు అహింసా కట్టుబాట్లను తెంచుకొని బయట పడుతుందని వారికి తెలుసు. ఇందుచేతనే కాంగ్రెసు నాయకత్వంలేదు. అది యుద్ధఅవకాశాన్ని వినియోగించుకొని సామ్రాజ్యవాదంతో పోరాటం లేకుండా బేరమాడి లాభం పొందగోరుతుంది.

(ప్రపంచయుద్ధము మనకర్తవ్యం పేజీ 33, 34, 35 లలో)

కాంగ్రెసు నాయకులు సిమ్లా, వైట్ హాలులవైపు అరుస్తులుచాచుకు చూస్తున్నారు.

(యుద్ధము వివిధపార్టీల నిజస్వరూపము పి. సి. జోషి 11, 12 పేజీలో)

మహాత్మ గాంధీజీ జాతీయపోరాటానికిస్వరూపాన్ని తీర్చి దిద్దిన జాతీయనాయకుడు. ఏఏ పరిస్థితుల్లో ఎలాంటిరకపు పోరాటాన్ని ప్రారంభించాలో తెలిసిన జాతీయనేత. ప్రజాచైతన్యాన్ని క్రమేపి పెంపొందిస్తూ తదనుగుణ్యమైన కార్యక్రమాల్ని ప్రజా సముదాయానికి ప్రసాదించగలదిట్ట. అలాంటి బాపుజీని "ఇపుడు కాంగ్రెసును సత్యాగ్రహుల తెగగా మార్చాలా లేక కాంగ్రెసును పోరాట సంస్థగా వినియోగించడమే మానివేయాలా అని తపస్సు చేస్తున్నాడు. జాతీయనాయకుడు తానే నిర్మించిన జాతీయసంస్థను నాశనం గావించడానికి సిద్ధపడు తున్నాడు." "తనగతాన్ని నిరశించుకునే నాయకుడు, తన గత అనుభవాలను దాటి ముందుకు సాగేబదులు, వెనక్కి పోతున్నాడు."

| |
|---|
| అంగిట్లో అమృతం, అత్మలో విషం. |

ఈ పి. సి. జోషియే ఈనాడు కమ్యూనిస్టులు - కాంగ్రెసు అను తన వ్యాసంలో "మాకు కాంగ్రెసు పితృసంస్థ. కాంగ్రెసు నాయకులు రాజకీయంగా మాకు తండ్రుల వంటివారు. కాంగ్రెసు అనుచరులంతా మాకు సోదరులలాంటి వాళ్ళు" అంటున్నాడు. (3 వ పేజీ) ఈ మాటలు చిత్తశుద్ధితో అంటున్న మాటలేనా? పశ్చాత్తాపాల్ని ప్రకటించే మాట

లేనా? కాంగ్రెసునాయకులపట్ల 'అంగిట్లో అమృతం, ఆత్మలో విషం'తో పి. సి. జోషీ ప్రవర్తిస్తున్నాడు. ఇంకా వీరి గూడు పుఠాణీ తెలుసుకోవాలంటే కాంగ్రెసు నాయకులను గురించి కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి పి. సి. జోషీ ఏమన్నాడో చూడండి. "తన అనుచరుల పైవున్న పలుకుబడినే గోల్పోతున్న సమయంలో, తనకంటే సామ్రాజ్య వ్యతిరేకు లయిన వర్గాలు తన పలుకుబడిలో లేనప్పుడు, వానిపై ఆధారపడి పోరాటం ప్రారంభించేకంటే సామ్రాజ్య పరిపాలనకు వినయంతో లొంగి పోతుంది. సామ్రాజ్యవాదులకు ఎదురుతిరగడానికి బదులు, సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమానికే ఎదురు తిరుగుతుంది. సామ్రాజ్య వాదంతో రాజీ పాలసీ విధానాన్ని యిందుకే సిద్ధపరుస్తుంది."

(యుద్ధము వివిధపార్టీల నిజస్వరూపము — పి. సి. జోషీ — పేజీ 13)

చూసారా! మిస్టర్ జోషీకి కాంగ్రెసు నాయకులు అంటే ఎంత అవ్యాజ ప్రేమో? జోషీలాంటి ఆచార్య దేవుల అనంత కారుణ్యంవలనే కాంగ్రెసు నాయకులు ప్రాణాలతో, పరువుతో జీవిస్తున్నారు.

ఇలా కమ్యూనిస్టులు జాతీయ నాయకత్వంపై నీలాప నిందలు వేస్తూ, తమ విష ప్రచారం సాగిస్తూ, జాతీయ కాంగ్రెసు తీర్మానములకు పూర్తిగా వ్యతిరేకంగా పనిచేస్తూ, కార్మికవర్గ నాయకత్వం వహిస్తున్నామని 'పోజులు' ఇచ్చు

కుంటూ వస్తున్నారు. ఈ 'నాడు మేముకూడ కాంగ్రెసు వాదులమేనని వేషాలు వేసుకొని మోసం సాగిద్దామని విపరీత ప్రయత్నములు చేస్తున్నారు. కాంగ్రెసుకూ వ్యతిరేకులే, కాంగ్రెసు సోషలిస్టులకు వ్యతిరేకులే! అంతేగాక, కాంగ్రెసు సోషలిస్టులే కాంగ్రెసు వ్యతిరేకులని రుజువు చేయడానికి ముప్పాతిప్పలువడుతూ, పున్నవి లేనివి పిచ్చిగీతలు గీసి జయప్రకాశనారాయణ రాళ్లాడంటున్నారు. కాని, ఈసందర్భంలో ముఖ్యంగా మనం గమనించవలసిందేమంటే.

"కాంగ్రెసు సోషలిస్టు నాయకులు, కాంగ్రెసునాయకత్వం కాంగ్రెసును ఎలా నడుపగోరుతుందో అలాగే తమ పార్టీని నడుపసాగారు. సిద్ధాంతాలతో బూర్జువావర్గానికి లొంగుబాటు" "సంస్థను నడుపుట, పెత్తనం చేయుటలోకూడ బూర్జువా నాయకత్వాన్ని అనుకరించునట్లుగా చేసింది"

(యుద్ధము వివిధపార్టీల నిజస్వరూపము పి. సి. జోషీ పే 18)

ఆ జోషీయే ఈనాడు, జయప్రకాశ నారాయణవగైరా కాంగ్రెసు సోషలిస్టులు వ్రాతలను, గాంధీజీ, అజాద్ లు గావించిన ప్రకటనలతో పోల్చి చూస్తే, కాంగ్రెసు పంథాకూ, కాంగ్రెసు సోషలిస్టుల పంథాకు, యేమైనా పొత్తువుందేమో స్పష్టంగానే తెలుసుకోవచ్చు.

కాంగ్రెసు పాలసీని సరిగా ప్రచారంచేస్తూ, కాంగ్రెసు ప్రతిష్ఠను యినుమడింపచేసి, దాని గౌరవాన్ని కాపాడినదెవరో

ఎవరు నిజమైన కాంగ్రెసు వాదులో నిర్ణయించమని కోరుతున్నాను. (కమ్యూనిస్టులు—కాంగ్రెసు) (22—28 పేజీల్లో)

కాంగ్రెసు సోషలిస్టులు "సిద్ధాంతాలలో బూర్జువావర్గానికి లొంగుబాటు అయిపోయారని పి. సి. జోషీగారిపైన విరుచుకుపడ్డారు. అంటే, కాంగ్రెసు తీర్మానాలకు వ్యతిరేకంగా కాం. సో. ప్రవర్తించలేదని మండిపడుతున్నారు. అంతేకాక తాము అలా కాంగ్రెసు తీర్మానాలను వ్యతిరేకించడము, బూర్జువావర్గాన్ని ప్రతిఘటించామని రొమ్ము విరుచుకుంటున్నారు. వారే ఈనాడు, కాం. సో. పాలసీ కాంగ్రెసుపాలసీకి విరుద్ధముగానున్నదనియూ, కమ్యూనిస్టులే నిజమైన కాంగ్రెసు వాదులనియూ ప్రగల్భాలు కొడుతున్నారు.

అసలు నిజమేమంటే కమ్యూనిస్టులు - కాంగ్రెసు వ్యతిరేకులే, కాంగ్రెసు సోషలిస్టులకు వ్యతిరేకులే. కాంగ్రెసునాయకత్వం బూర్జువా నాయకత్వం! కాం. సో. వారికి లొంగిపోయారు! అందువల్ల కమ్యూనిస్టులు ఇరువురికీ వ్యతిరేకులే. అసలు విషయం ఇది!

ప్రజాయుద్ధ పంథా
100 కి 100 పాళ్లు
కాంగ్రెసు వ్యతి
రేక పంథా

"ఇది "ప్రజాయుద్ధమా?" కాదా? అనే ప్రశ్నను ప్రస్తుతం విడిచిపెడదాం. ఎందువల్లనంటే, ఈయుద్ధం "ప్రజాయుద్ధం" ఎలా అయిందో, మీకర్థంకాలేదు." (కమ్యూనిస్టులు కాంగ్రెసు పేజీ 13) అంటూ ప్రధానసమస్యనుండి కాం

గ్రెసు వాదుల దృష్టిని మరల్చడానికి నక్కజిత్తులు వేస్తున్నాడు జోషీ.

జోషీకున్నంత విజ్ఞానం, రాజకీయ పరిజ్ఞానం ఇలాంటివే ఇంకా ఎన్నో కాంగ్రెసువాదులకు లేవు! అందుకే ఈ యుద్ధం 'ప్రజాయుద్ధం' ఎలా అయిందో వారికి అర్థంకాలేదు. అవునా? ఎవరికయినా అహంకారము తగదుసుమా! అయితే, తెలియని వారికి తెలిసినవారు తెలియచెప్పాలికదా! కాని ఆపనికి జోషీగారు పూనుకోరట. అందుకే ఈప్రశ్నను ప్రస్తుతం విడిచిపెడదాం అంటూ చల్లగా జారుకుంటున్నారు. ఇందులోని చిదంబర రహస్యం ఇది. "ప్రజాయుద్ధం" అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్లు ఘోషించారు. కాని ఎంత మసిపూసి మారేడుకాయ చేద్దామనుకున్నా ప్రజలెవ్వరూ ఈమాట నమ్మలేదు. విసిగి వేసారి, తమపాలసీలో నున్న దివాళాకోరుతనాన్ని మరుగు పరచుకుంటూ 'దురదృష్టవశాత్తు ప్రజలు ఈ యుద్ధాన్ని తమ యుద్ధంగా భావించుటలేదని' కన్నీరు కారుస్తున్నారు. 'అసలు' భారతప్రజలు తమదికాని యుద్ధాన్ని తమ యుద్ధంగా భావించడంలేదనే సత్యంమాత్రం జోషీకళ్ళకు కన్పడదు. రాజకీయ చత్వారము బాగా ముదిరిపోతే, ఎలా కన్పిస్తుంది?

**సోవియట్ యూనియన్ రక్షణా? భారత స్వాతంత్ర్యమా?**

1941 జూన్ 22 తేదీన హిట్లరు ద్రోహబుద్ధితో సోవియట్ యూనియన్‌పై దాడి వెడలుటతో సామ్రాజ్యవాదయుద్ధం ప్రజాయుద్ధంగా మారింది. ఈదాడి రెండవ

ప్రపంచయుద్ధంయొక్క స్వభావాన్ని పూర్తిగా మార్చివేసింది. సోషలిస్టు రష్యాపై దండయాత్ర తక్కిన ఏయితర దేశంపై దండయాత్ర వంటిదికాదు. అన్ని దేశాల కార్మికుల మాతృదేశంపై దాడి అది; ప్రాచ్యదేశాల పీడితప్రజల దృష్టిలో సామ్రాజ్యవాద వ్యతిరేకులకు మిత్రమైన దేశంపై దండయాత్ర అది. నూతన నాగరికతపై దాడిఅది. అన్ని దేశాల కార్మికులకు, కష్టజీవులకు, బానిసజాతులకు, ప్రజలకు ఆధారమైన ఒకే ఒకవిప్లవ విజయదుర్గంపైన ప్రతిష్టించిన ఎర్రజెండాపై దాడిఅది. ఈ దుండగీడులదాడి జయం పొందలేదు. పొందజాలదు ఫాసిస్టు బందిపోటువారలు ప్రపంచాధిపత్యం సంపాదించడానికి మెట్టుగా సోవియట్‌పై దండయాత్రచేసారు. అందుచే సోవియట్ యూనియన్ రక్షణపై జరిగేయుద్ధం ఆచరణలో ప్రపంచ స్వాతంత్ర్య సంపాదనకొరకు జరిగే యుద్ధానికి నాంది అయింది. ప్రపంచ విప్లవదుర్గాన్ని రక్షించే అజేయమైన రెడ్ ఆర్మీ ప్రపంచ స్వాతంత్ర్యయుద్ధంలో అగ్రగామిగా ముందంజవేస్తుంది. సోవియట్ యూనియన్ నేడు ధరించుతున్న చరిత్రాత్మకమయిన పాత్ర అటువంటిది. "ప్రపంచ పరిస్థితుల్లో ఈ నూతనమయిన నిశ్చిత పరివర్తనంలో మార్పు యుద్ధంయొక్క సామ్రాజ్యవాద దశ అంతమయింది. ప్రజాయుద్ధదశ ప్రారంభమయింది. సర్వదేశ ప్రజలకు మానవలోకానికి అది గొప్ప చారిత్రకమయిన మార్పు."

('అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ పంథా' పి. సి. జోషి 79, 80 పేజీలు)

పైమాటలో యుద్ధ స్వభావం ఎందువల్ల మారిందో పి. సి. జోషీ చెప్పడానికి యత్నించాడు. "సర్వదేశ ప్రజలకు మానవలోకానికి అదిగొప్ప చారిత్రికమయిన మార్పు" తీసుకొచ్చి నప్పటికి నేడు ఇది ప్రజాయుద్ధమా? కాదా? అనే ప్రశ్నను ప్రస్తుతం విడిచిపెడదాం అంటున్నాడు. ఎందువల్ల అంతబ్రహ్మాండమయిన సమస్యను విడిచిపెట్టాలి? ఇందులో ఏదో మోసమున్నది. ఈ చిదంబర రహస్యము ఏమంటే, తమ ప్రజాయుద్ధ పాలసీని వివరిస్తే, తమ జాతీయ ప్రతీఘాతుక తత్త్వం బయటపడుతుందని వారికి తెలుసు. కాంగ్రెసుకువారు ఎలా వ్యతిరేకులో తేటతెల్లమవుతుందని భయం. తమసామ్రాజ్యఅనుకూల పంథా కాంగ్రెసువాదులకు నచ్చదని గుండె పీచుపీచుమన్నది.

దొడ్డిదారి

అందుచే చడీచప్పుడు లేకుండా జారుకున్నాడు. ఇందులో పిరికితనము కన్పిస్తోంది. ఎందుచేతనంటే ఈ కారణంవల్ల ఇదీ ప్రజాయుద్ధమని చెప్పకుండా దొడ్డిదారిని అదే వ్యాసంలో ప్రజాయుద్ధపాలసీని ప్రబోధంచేయ పూనుకోవడమే ఇందుకు నిదర్శనం. చూడండి. అదే వ్యాసంలో జోషీ ఏమంటున్నాడో చూడండి. "ఈ రోజున ప్రజలందరి జీవితాల మీద యుద్ధంయొక్క ప్రభావంపడింది. మన కిష్టమున్నా లేకపోయినా ప్రపంచ భవిష్యత్తును నిర్ణయించేది యుద్ధమే. దేశం

లో ఇప్పుడు జరిగే ఘటనలన్నీ యుద్ధం మూలంగానే జరుగుతున్నాయి. "అట్టి యుద్ధంవల్ల కాంగ్రెసు నాయకులు ముక్కు మూసుకుని" 'నెగిటివ్' ధోరణిలో కూర్చోవడంవల్ల వారి రాజకీయపాలసీకూడ నిస్సారమై, దేశాని కుపయోగపడకుండా పోయింది. మాటల్లోమాత్రం వారు మిత్రరాజ్యాల విజయాన్నే కోరుతున్నారు.

కాని చేతల్లో నిస్సహాయతను వెల్లడిస్తున్నారు. ఏ ముఖ్య సమస్యలను పరిష్కరించవలసి వచ్చినా! "మన మేమీ చేయలేం." అని చేతులు ముడుచుకుని కూర్చుంటున్నారు. బ్రిటిషు ప్రభుత్వం భారత దేశ స్వాతంత్ర్యాన్ని గుర్తించేటంత వరకు, ప్రపంచ ప్రజల స్వాతంత్ర్య పోరాటంలో కలవలేమని వాదిస్తున్నారు. బ్రిటిషు అధికారం తొలగేవరకు మన దేశాన్ని మనం రక్షించుకోలేమని చెబుతున్నారు. బ్రిటిషు పాలకవర్గం జాతీయ ప్రభుత్వాన్ని యివ్వనంతకాలం, మనం నిల్వవ్యాపారస్థుల దోపిడీని అరికట్టలేమంటున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే మనకనుకూలించే పరిస్థితులను ఇతరు లెవరో కల్పించుతారని ఎదురుచూస్తున్నారు. ఏ దేశ చరిత్రలోనూ యిలా ఎప్పుడూ జరుగదు, యదార్థజీవితానికిది పూర్తిగా వ్యతిరేకం."

(కమ్యూనిస్టులు కాంగ్రెసు_జోషీ పేజి 12)

అదే వ్యాసంలో 23 వ పేజీలో జోషీ ఏమి వ్రాసాడో చూడండి "కాంగ్రెసు పాలసీని సరిగా ప్రచారం చేస్తూ, కాంగ్రెసు ప్రతిష్ఠను యినుమడింపచేసి, దాని గౌరవాన్ని కాపాడిన

దెవరో, ఎవరు నిజమైన కాంగ్రెసువాదులో, నిర్ణయించమని కోరుతున్నాను.''

నెగిటివ్-పాజిటివ్ పాలసీలు

దీనినే మొద్దిగిల్లుతూ జోలపాడటం అంటారు. కమ్యూనిస్టులు ఎలాంటి కుయుక్తితో ప్రచారం చేస్తారో గమనించండి. "అట్టి యుద్ధంవల్ల కాంగ్రెసు నాయకులు ముక్కుమూసుకుని "నెగిటివ్" ధోరణిలో కూర్చొనడంవల్ల, వారి రాజకీయ పాలసీ కూడ నిస్సారమై దేశాని కుపయోగపడకుండా పోయిందని అన్న జోషీయే 'కాంగ్రెసు పాలసీని సరిగా ప్రచారం చేస్తున్నాము' మేము 'నిజమయిన కాంగ్రెసువాదులం' అంటున్నాడు. ఇలాంటి వారికి అబద్ధాలే కూడు. చూసారా! కాంగ్రెసు పాలసీ యుద్ధంపట్ల "నెగిటివ్" గా వున్నదంటూ, తమ పాలసీ "పాజిటివ్"గా ఉన్నదంటున్నాడు. దీని భావమేమి తిరుమలేశ? కాంగ్రెసుకూ, కమ్యూనిస్టులకు "నెగిటివ్ కు "పాజిటివ్" కూ ఉన్నంత వైరుధ్యమున్నదని జోషీగారే అంగీకరించారు. కాని అదేనోటితో మేము నిజమైన కాంగ్రెసువాదులమని అంటున్నాడు. అంటే కోకిలకూ, కాకికి వున్న వ్యత్యాసాన్ని అంగీకరిస్తున్నాడు కాని, కాకికూతలే నిజమైన కోకిల గానమని అంగీకరించమంటాడు. జోషీగారి మాటల్ని అంగీకరించేవారు ఏ పిచ్చాసుపత్రిలోనో దొరుకుతారేమో, అదీ అనుమానమే. కాని ఇటువంటి వారు

కొందరు జోషీకి దొరకకపోలేదు. ఒక్కొక్కరి మాటలంటే ఒక్కొక్క రకపు వారికి విశ్వాసం! వీరుఇలాంటి 'యథార్థాన్ని' చాటుట వల్లనే కాజోలు 'లోకవిరోధులు' అయిపోయారు.

ప్రజా యుద్ధమా ?

ఎవరు రాజకీయపాలసీ దేశాని కువ యోగ పడకుండా పోయిందో, పైపెచ్చు దేశద్రోహానికి దారితీసిందో ఆలోచిద్దాం. ప్రపంచయుద్ధం ప్రచండంగా సాగిపోతుంటే చేతులు ముడుచుకొని కూర్చొని అంతతో సంతృప్తిపడక వీటికి ఎవరు ఎదురీదినారో సుస్పష్టమే యుద్ధంపట్ల 'పాజిటివ్' వైఖరితో ప్రవర్తిస్తున్నా మంటున్నాడు జోషీ. "సోవియట్ యూనియన్ రక్షణార్థై జరిగేయుద్ధం ఆచరణలో ప్రపంచ స్వాతంత్ర్య సంపాదనకొరకు జరిగేయుద్ధానికి నాంది అయింది" అనే విశ్వాసమే యుద్ధంపట్ల 'పాజిటివ్' వైఖరికి కారణమని జోషి అంటాడు. అయితే, "సోవియట్ యూనియన్ రక్షణార్థై జరిగే యుద్ధం" 1941 జూన్ 22 వ తేదీని ప్రారంభమయింది. కాని జోషి అప్పటినుండి యుద్ధంపట్ల ఈ 'పాజిటివ్' వైఖరిని అవలంబించ లేదు. అప్పటినుండి దానిని ప్రజాయుద్ధమని ప్రచారం చేయలేదు. పైపెచ్చు తర్వాత దాదాపు 6 నెలల వరకు యుద్ధ వ్యతిరేక ప్రచారముకూడ చేశారు. కదంతొక్కుతూ పదంపాడుతూ ప్రజావిప్లవం సాగించాలన్నారు.

రష్యా జర్మనీయుద్ధం ప్రారంభమయ్యాక 6 నెలలకు ఒక 'శుభోదయాన' అంటే 1941 డిసెంబరులో '1941 జూన్ 22 తేదీన హిట్లరు ద్రోహబుద్ధితో సోవియట్ యూనియన్ పైన దాడిచేయటంతో సామ్రాజ్యవాద యుద్ధం ప్రజాయుద్ధం గామారింది'' అన్నారు కమ్యూనిస్టులు. ఆరు నెలలు పాటు ఈ మార్పును వీరు గుర్తించ లేక పోయారట. అందుకు పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చుతూ లెంపలు వేసుకొని, మరిన్ని పల్టీకొట్టారు. 'సంకుచిత జాతీయవాదులుగానే మనం యుద్ధస్వభావాన్ని పరిశీలించి పొరపడ్డాము. కాని బోల్షివిక్కు దృష్టితో పరిశీలించ లేక పోయాం!' అని వాపోయారు. కాని ఇదంతా తంతు - వట్టి బూటకం. అసలు 'ప్రజాయుద్ధ' పాలసి భారత కమ్యూనిస్టులు వ్యతిరేకించినదే. అంటే రష్యాజర్మనీయుద్ధం ప్రారంభమయ్యాక ఆరునెలలపాటు యుద్ధవ్యతిరేక ప్రచారాన్ని భారతకమ్యూనిస్టులు సాగించారంటే వారుప్రజాయుద్ధ పాలసీని అంగీకరించ లేదని రుజువుఅగుచున్నది. అంతేకాదు, రష్యాప్రవేశంతో యుద్ధస్వభావంలో మార్పువచ్చిందని అన్న వారినిసామ్రాజ్యవాదుల తైనాతీలని, బ్రిటిషు ఏజెంట్లనీ, ప్రచారం చేసారు. కాలచక్రం తీవ్రంగా భ్రమించింది. కాలగతి! తిరిగి వారే 6 నెలలతర్వాత యుద్ధస్వభావం మారిందని ప్రచారం చేయుటానికి తయారయ్యారు. ఇలా అంటున్నామని, భారత కమ్యూనిస్టులు; తమంత తాముగా స్వతంత్రంగా ఆలోచించుకొని పాలసీని మార్చుకున్నారని అపోహ పడకండి. భారత కమ్యూ

నిస్టులకు తమంత తాముగా ఆలోచించి నిర్ణయాలకు వచ్చే అలవాటు సాంప్రదాయం సిద్ధంగా ఎప్పుడూ లేదు. అయినప్పుడు ఈనాడు క్రొత్తగా రమ్మంటే ఎలా వస్తుంది? తమకొరకు ఆలోచించడానికి ఇతరులను ఆశ్రయించే అలవాటు కలవారు. వండి వడ్డించే వా రుండగా, కూర్చొని తినలేక, కాదు! కాదులే! వండుకుంటామనే అవివేకులము తాము కాదని కమ్యూనిస్టులు గర్వపడవచ్చును. అది వారి 'యిష్టారాజ్యము'. దానికేం? ప్రజాయుద్ధపాలసీ బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి హారీ పాలిట్ మనవాళ్ళకు ఎలాఅందచేసాడో ఆలోచించండి. అనేక మంది అనేక విధాలుగా అంటున్నారు. కొందరు ప్రభుత్వం వారి ద్వారానే ఇలాంటి 'ప్రజాయుద్ధపాలసీ' హారీపాలిట్, భారత కమ్యూనిస్టులకు అందచేసాడని అంటున్నారు. ఆంగ్లో - సోవియట్ ఒడంబడిక, బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ చర్చిల్ ప్రభుత్వానికి చేసిన మద్దతు. ఇలాంటి కారణాలవల్ల ఇది నిజమని అనుకోడానికి గట్టి కారణాలే వున్నాయి. నిజా నిజాలు జోషీకి తెలియాలి. అలా బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ వారిద్వారా అందిన తాకీదు యుద్ధ స్వభావాన్ని కమ్యూనిస్టుల దృష్టిలో మార్చివేసింది. అద్భుతం, అపూర్వం. చూసారు? యుద్ధస్వభావాలు ఎంత తేలికగా మారతాయో! ఇలా భారత కమ్యూనిస్టులు ప్రజాయుద్ధపాలసీని విదేశాలనుండి దిగుమతి చేసుకున్నారు. ఇలా దిగుమతిచేసుకున్న సరుకును మార్కెట్టులో పెట్టి 'గిట్టుబాటు' అయ్యేలా చూసుకొని, 'లాభసాటి' 'బేరం'

చేయాలని కమ్యూనిస్టులు నిర్ణయించుకున్నారు. కాని, ఈ ప్రజాయుద్ధపునినాదం నాసిరకపు సరుకు. అంచేత, మార్కెట్టులో చెలామణీ అయ్యేటట్లుగా లేదు. దివాళాతీసేటట్టున్నది. 'క్రామెడ్సు'కు అంచేత మంచి ట్రేడ్‌మార్కు కావలసి వచ్చింది. జాతీయ ట్రేడ్‌మార్కు తగిలించారు. 'మాదే నిజమైన జాతీయ పంథా' అంటూ రాజకీయ మార్కెట్టులోకి తయారయ్యారు. 'కిం' ప్రయోజనం? ఏంచేసినా ఏమీలాభం లేకపోయింది. భారత ప్రజలెవ్వరూ ప్రజాయుద్ధ నినాదాన్ని అంగీకరించలేదు. దాంతో కమ్యూనిస్టులు రాజకీయంగా దివాళాతీసారు. ప్రజలనుండి పూర్తిగా వేరుపడిపోయి, దూరమైపోయారు.

**యుద్ధస్వభావం ఎప్పుడు మారుతుంది?**

యుద్ధంలో పాల్గొనే దేశాలస్వభావాల్లో మార్పు వచ్చినప్పుడే యుద్ధస్వభావంలో మార్పువచ్చింది. కాని, నేడు యుద్ధంలో పాల్గొంటున్న దేశాల ప్రభుత్వాల భావాల్లో ఏమి మార్పు రాలేదు. బ్రిటిషు సామ్రాజ్యవాదం, జర్మన్ నాజీజం, సోవియట్ రష్యా, జాతీయచైనా, మిలిటరిస్టు జపాన్, ఈ దేశపాలకవర్గాల్లో, యుద్ధ నిర్వాహకుల్లో, ఏమి స్వాభావరీత్యా మార్పు రాలేదు.

అయితే ఆంగ్లో, సోవియట్ సంధిని గొప్పగా ఉదహరించి, బ్రిటిషు సామ్రాజ్యవాదులు ప్రజాశక్తుల శిబిరంలో కై దీలయి పోయారంటూ పగటికలలు కంటున్నారు. కమ్యూ

నిస్టులు 1939 సోవియట్, జర్మన్ ఒడంబడికలు హిట్లరుస్వభావంలో మార్పు వచ్చినందువలననే జరిగినాయని ఏ కమ్యూనిస్టు అనలేదు. జర్మన్ ప్రజల ఒత్తిడివలన అలాంటి సంధులు జరిగినాయని ఏ కమ్యూనిస్టు అనలేదు. కాని ఆంగ్లో - సోవియట్, ఒడంబడికకు బ్రిటిషు ప్రజల ఒత్తిడియే కారణమని కమ్యూనిస్టులు అంటున్నారు. అయితే, ఒక్క ప్రశ్న, రష్యా-జర్మనీయుద్ధం ప్రారంభమయిన 12 గంటలలోపునే చర్చిలు సోవియట్ కు తన సహాకారాన్ని వాగ్దానం చేశాడు. అంటే చర్చిల్ హృదయ పరివర్తనం తెగలిగిన బ్రహ్మాండమయిన ప్రజావత్తిడి ఆ 12 గంటలలోపునే వచ్చి ఉండాలని స్పష్టపడుతున్నది. అయితే అలాంటి ప్రజావత్తిడి ఏరూపంలో వచ్చిందో కూడ మనం తెలుసుకోవాలి. నామరూపాలు లేకుండా ఉండదుగదా? అయితే 1941 జూన్ 22 వ తేదీన ఇంగ్లాండులో అంత ఉపద్రవం చర్చిల్ కు ఏమి వచ్చింది? కార్మికులేమయినా జనరల్ స్ట్రైక్ చేసారా? కనీసం చేస్తామని బెదరించారా? లేక ప్రభుత్వ కార్యాలయాలపై దాడిచేసినారా? ఇలాంటివేమీ ప్రజలు ఆరోజున చేయలేదు. ఒక్కరోజులో గొప్ప ఆందోళనయినా ప్రజలు చేయగలిగే స్థితిలో వుండరు. అయినా, ఆరోజుననే చర్చిలు తన సహాకారాన్ని సోవియట్ కు వాగ్దానం చేసాడు. అంటే, కమ్యూనిస్టు లంటున్న ప్రజావత్తిడి వారి ఊహాగానములోనే వున్నదిగాని బ్రిటనులో లేదని తేలి

పోయింది. అయితే చర్చిల్ ఏ ఒత్తిడివలన రష్యాతో సంధి చేసుకున్నాడు? జర్మనీ ఒత్తిడివలననే! ఆరోజుల్లో బ్రిటిషు సామ్రాజ్యం ఎంతప్రమాదకర స్థితిలోవున్నదో గుర్తుకుతెచ్చుకోండి. బ్రిటిషు రాజనీతి చతురతలో ఒకభాగంగానే చర్చిలు సోవియట్‌తో సంధి చేసుకున్నాడు. ఎలాగయినాసరే తన రవిగ్రుంకని సామ్రాజ్యాన్ని నిలబెట్టుకోవాలి. తనపై ధ్వజమెత్తిన హిట్లరునడక జోరుగా సాగిపోతుంటే ఆ హిట్లరును హోరాహోరిగా ఎదుర్కొంటున్న స్టాలిన్ చర్చిలుకు స్నేహితుడయ్యాడు. రష్యా రక్షణాయే ఆశయంగా పెట్టుకున్న స్టాలిన్‌కు ఎవరు ఏఉద్దేశంతో అప్పయిచ్చినా తీసుకోడం తరుణోపాయం. హిట్లరుతో ఒడంబడిక చేసుకున్నప్పుడు అతడు ఫాసిస్టని స్టాలిన్‌కు తెలుసునుకదా, అలాగే చర్చిల్‌తో ఒడంబడిక చేసుకున్నప్పుడు అతడు బ్రిటిషు సామ్రాజ్యానికి ప్రధాన మంత్రనికూడ తెలుసును. అదీ అసలు విషయం. అంతేకాని ఎవరి స్వభావంలోను మార్పురాలేదు. యుద్ధంలో పాల్గొనే ప్రభుత్వముల స్వభావంలో మార్పు రానప్పుడు యుద్ధ స్వభావంలో మార్పు ఎలావస్తుంది? బహుశః, యుద్ధస్వభావం మారిపోయిందన్న వారి స్వభావం మారిపోయింది.

ఈనాడు బ్రిటను సోవియట్ రష్యాకుహిట్లరుకు వ్యతిరేకంగా ఎంతో సహాయంచేసింది. ఇదంతావారి స్వభావంలో మార్పుకాదా? అంటారు కమ్యూనిస్టులు. అయితే వీరికి ఒక ప్రశ్న. ఫిన్‌లాండు రష్యాయుద్ధాన్ని గుర్తుకు తెచ్చుకోండి.

ఫిన్‌లాండులోని మాన్నర్‌హీము వర్గానికి బ్రిటను పూర్తి సహాయం చేసి, సోవియట్ రష్యాను ప్రతిఘటించడానికి పూను కున్న తరుణంలో హిట్లరు వైఖరి సోవియట్ పట్ల ఎలావున్నదో తెలుపుకు తెచ్చుకోండి. బ్రిటనుకు, ఫిన్‌లాండుకు వ్యతిరేకంగా రష్యాకు సహాయుండవడ లేదా? హిట్లరు ఆనాడు ఎందువల్ల రష్యాకు సహాయపడ్డాడో ఈనాడు బ్రిటను కూడ అందుకే రష్యాకు సహాయపడుతోంది. సోవియట్ రష్యా నాశనం కావడం అటు ఫాసిస్టులకు ఇటు సామ్రాజ్య వాదులకు అందరకూ కావలసిం దేకాని వారికున్న సమస్య, ఎవరి నాయకత్వాన అనేదే. ఎందు వల్లనంటే, ఎవరు నాయకత్వం వహించి సోవియట్‌ను విధ్వం సంచేస్తారో, ప్రపంచ పెత్తనం వారికే సంక్రమిస్తుంది. ప్రపంచ పెత్తనం బ్రిటను కుండాలా? జర్మనీ కుండాలా? అను ప్రశ్న పైననే యుద్ధం ప్రారంభమయింది. రష్యా - జర్మనీ యుద్ధం కూడ అందులో ముఖ్యమైన భాగమే. అంతేగాని, రష్యా - జర్మనీ యుద్ధము ప్రత్యేకమైన సంఘటనగాదు.

> యుద్ధము శాంతివలెనే అవిభాజ్యము.

ఇది 'గ్లోబల్' యుద్ధము. అంచేత ఈ యుద్ధము రష్యాలో ఒక స్వభావంతోను, బ్రిటనులో ఒక స్వభావంతోను ఇండియాలో ఒక స్వభావంతోను ఉండదు' అంటున్నారు. 'ఇది రష్యా ప్రజలకు ప్రజాయుద్ధము కావచ్చు. కాని, బానిస భారతదేశానికి ఎలా అవుతుంది? అనే వారికి సమాధానంగా

పై మాటలు చెప్పబడుతూవున్నాయి. ఈ యుద్ధ జ్వాలలు ప్రపంచమంతటా ఆవహించాయి. ఇది 'గ్లోబల్' యుద్ధమే. అయితే ప్రపంచమంతటా రాజకీయ, ఆర్థిక సాంఘిక విధానాలు ఒకే మాదిరిగా లేవు. అనేక వైరుధ్యాలతో కూడి వున్నాయి. సోవియట్ రష్యా, యింపీరియలిస్టు బ్రిటను, జాతీయ చైనా, బానిసభారత దేశాల్లో వున్న రాజకీయ, ఆర్థిక, సాంఘిక విధానాలు ఎంత వ్యత్యాసాలతో వున్నాయో గమనించండి. కాని అన్ని దేశాలు యుద్ధంలో పాల్గొంటున్నాయి. కాని యుద్ధంలో అన్ని దేశాల ప్రయోజనాలు ఒకే మాదిరిగా లేవు. ఉదాహరణము. బ్రిటిషు సామ్రాజ్యం విస్తరిస్తే భారతీయులకు బానిసత్వ సంకెళ్ళు బిగింపబడినాయని అర్థమాతుంది. అంచేత ఈ యుద్ధము శాంతివలె అవిభాజ్యము అనే పేరుతో ప్రపంచ ప్రజలందరికీ ఇది ప్రజాయుద్ధమనుట అర్థరహితము. శాంతి విషయంలో ఆలోచించినా, ఈశాంతి అన్ని దేశాల్లోను ఒకే అభివృద్ధిని సూచించదు. సోవియట్ రష్యాలోని శాంతి, బానిస భారత దేశంలో శాంతి ఎలా రెండు వ్యతిరేకంగా వున్నాయో చూడండి. సోవియట్ రష్యాలో శాంతి సోషలిస్టు ఆర్థిక నిర్మాణానికి అవసరం. బానిస భారత దేశంలో శాంతి బ్రిటిషు సామ్రాజ్యం వర్ధిల్లడానికి అవసరం. ఇలాగే వాదన రబ్బరు సాగించినట్టు సాగించవచ్చు. కాని ప్రస్తుతం ఇదిచాలు.

నేడు రష్యాకు జర్మనీకి యుద్ధము సాగుతోంది. కాని, బ్రిటనుకు రష్యాకు యుద్ధం సాగడము లేదు. అంచేత, రష్యా విజయము జర్మనీ పాదాక్రాంత దేశాలకు విముక్తి చేకూరుస్తుంది. అంచేత జర్మనీ బానిసత్వంలోవున్న దేశాల ప్రజలకు, ఇది ప్రజాయుద్ధమే. కాని, బ్రిటను బానిసత్వంలోవున్న ప్రజలకు రష్యా విజయము విముక్తిని చేకూర్చలేదు. అంచేత, బ్రిటిషు బానిసత్వంలోవున్న ప్రజలకు ఇది ప్రజాయుద్ధము కాదు. బ్రిటిషు సామ్రాజ్య విజయము, భారత ప్రజల స్వాతంత్ర్యము, రెండూ ఒకేసారి లభించవికావు. అంచేత, భారత ప్రజల స్వాతంత్ర్య మెలా లభిస్తుంది? దీనికి ప్రత్యేకంగా వ్యాఖ్యానంతో సమాధానం చెప్ప నవసరం లేదు.

**ప్రపంచప్రజలస్వాతంత్ర్యపోరాటంలో భారతీయులు ఎలా పాల్గొనాలి?**

సోవియట్ రష్యా, చైనా లకు మనం ఎలా సహాయపడగలుగుతాం? జాతీయప్రభుత్వము కావాలి. అయితే దానిని భారత ప్రజలు ఎలా సాధించుకోవాలి? సామ్రాజ్యవాదులనుండి వరప్రసాదంగా మనం జాతీయ ప్రభుత్వాన్ని ఆశించడంలేదు. అది మన జన్మహక్కు! ప్రజాస్వామికం! స్వాతంత్ర్యం! ఇలాంటి ఆశయాలతోనే యుద్ధం చేస్తున్నామని బ్రిటిషు పెద్దలు చెప్పారుకనుక ప్రపంచ ప్రజలదృష్టిలో మన నైతిక బలాన్ని సంపాదించుకోవడంకోసం తాలిమితో వ్యవహరించి మీరు చిత్తశుద్ధితో అలాంటి ఆశయాలకొరకే

యుద్ధం చేస్తుంటే 40 కోట్ల భారతప్రజల్ని ఎలా బానిసలుగా వుంచుతున్నారు. భారత సమస్య మీదకు గీటురాయి. ఇదే అగ్నిపరీక్ష. అని కాంగ్రెసు సవాలు చేసింది. దానికి బ్రిటను మొండిచెయ్యి చూపెట్టింది.

యుద్ధఫలితాలు

యుద్ధసంక్షోభం నానాటికీ తీవ్రతరమైంది. 'నానాటికి తీసికట్టు నాగంబొట్లు' అన్నట్లుగా, ప్రజల ఆర్థికదుస్థితి మరీఅధ్వాన్నమైపోయింది. యుద్ధసంక్షోభం మూలాన భారతప్రజలు బ్రిటిష్ప్రభుత్వం మధ్యనున్న వైరుధ్యం వెయ్యిరెట్లు తీవ్రమయింది. రాష్ట్రీయ స్వాతంత్ర్యంలోని బండారం కాస్తా బైటపడింది. (ఇండియా డిఫెన్సు ఆర్డినెన్సు) "దయా, ధర్మం" అనే మాయబురఖా తొలగిపోయింది. ఇదివరకే స్వల్పంగావున్న పౌరసత్వహక్కులను ప్రభుత్వం తొలగించివేసింది. ధరలు విపరీతంగా పెరిగినాయి. తమ జీతాలను హెచ్చించుటకు కార్మికులు జేసిన ప్రయత్నాలు పోలీసులు అణచివేశారు. జమిందారులు, సంస్థానాధీశులు ఎప్పటివలెనే తమ రాజభక్తిని రుజువు చేసుకోడానికి పన్నులద్వారా రైతులచర్మం ఒలిచి సామ్రాజ్య వాదులు బొక్కసం నింపుతారు.

రాజకీయహక్కులు, పౌరసత్వహక్కులు, ఈవిధంగా రద్దు కావించడం, ఆర్థికదుస్థితి హెచ్చడం, భద్రతలేనిఅపాయకరమైన వాతావరణం ఏర్పడడం, యుద్ధఫలితాలని ప్రజలు

గ్రహించి మరల దేశంలో ప్రజల్లో ఇంత అసంతృప్తి ప్రబలుతున్నా, బ్రిటిషు ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లువూరుకొన్నది. జపాను, దూరప్రాచ్యంలో విజృంభించి, మలయా, బర్మాలను గుటకాయ స్వాహా చేయడంతో, భారతీయుల్లో 'భద్రతకై' ఆరాటం ఎక్కువయింది. "ఇదే సమయంలో బ్రిటిషు ప్రభువులు కాస్త కళ్ళు తెరువాలిసి వచ్చింది. దీనికి కారణం తమ సామ్రాజ్యవాద వలస ప్రభుత్వాలు పతనం కావడమే. దీనికితోడు దేశంలోని పరిస్థితులు ప్రమాదకరంగా పరిణమించాయి. దీంతో భారతీయులను యుద్ధంలో పూర్తిగా దింపుదామని తలచారు. కాని భారతీయులకు నిజమైన అధికారాన్ని స్వాధీనం చేయడానికి నిరాకరించారు. జయప్రదమైన దేశరక్షణకు భారతీయు లందరినీ సమీకరించగల స్వతంత్ర ప్రభుత్వాన్ని నిరాకరించడమే.



3

# క్రిప్సు రాయబారం

బ్రిటిషు ప్రభుత్వం క్రిప్సును రాయబారిగా పంపింది. కాంగ్రెసు నాయకులు దేశరక్షణ అధికారం లేని జాతీయ ప్రభుత్వం, భారతీయులు బానిసత్వాన్ని బలపరిచేదిగానే వుంటుందని భావించారు. గాంధిజీ "క్రిప్సు సూచనలు" (పోస్టు డేటెడ్ చెక్) గా ప్రకటించారు. "క్రిప్సు ప్రతిపాదన" లను భారతీయులు త్రిప్పికొట్టారు. ఈ సందర్భంలో కమ్యూనిస్టుల వైఖరిని మనం గుర్తుకు తెచ్చుకోవాలి. మునుపటినుండి కాంగ్రెసు నాయకులు రాజీకై ప్రాకులాడుతున్నారనియు, కొన్ని సంస్కరణలతోనే వారు సంతృప్తి చెందుతారనియూ, కమ్యూనిస్టులు కాంగ్రెసు నాయకులను నిందించారు. "ప్రజలవైపు ముడ్డిపెట్టి బ్రిటను కేసి దృష్టి నిగుడ్చు" పద్ధతిని కాంగ్రెసునాయకత్వం అవలంబించిందని అర్థంలేకుండా నిందించారు. "కాంగ్రెసు నాయకులు సిమ్లా వైటుహాలులపై అరుగులు చాచుకు చూస్తున్నారు." "యుద్ధం విషయంలో సామ్రాజ్య వాదంతో కాంగ్రెసు రాజీపడితే ప్రపంచ ప్రజాస్వామిక ఉద్యమానికి ద్రోహియూ, జాతీయ వుద్యమానికి వినాశకారియు అవుతుంది. సెంటరు "లో" ఏదో ఒక రకపు బాధ్యత ఇస్తే రాజీ సాధ్యమౌతుంది. ఇదే కాంగ్రెసులో అధికారం వహిస్తున్న నాయ

కత్వం కోరుతున్నది" ఇలా కమ్యూనిస్టులు, కాంగ్రెసు నాయకులపై విషప్రచారం సాగించారు. క్రిప్సు ప్రతిపాదనలను కాంగ్రెసు నాయకత్వం త్రోసివేయుటయే దీనికి ప్రత్యక్ష తార్కాణం. కమ్యూనిస్టుల ఊహాలు ఎంత నిరాధారమైనవో, ఎంత అసమంజసమైనవో తెలిసిపోయింది.

**సామ్రాజ్యవాదంతో రాజీ**

చిత్రమేమంటే, కాంగ్రెసు నాయకులు రాజీ యనుమాట లేక, భారతీయులకు నిజమైన అధికారాన్ని స్వాధీనం చేయుమని, అలా అయితే భారత ప్రజలు ఉత్సాహంగా తమ యుద్ధాన్ని జయప్రదంగా నిర్వహించుకోగలుగుతారనీ అంటే, కమ్యూనిస్టులు 'క్రిప్సు ప్రతిపాదనల'ను కాంగ్రెసువాదులు త్రోసివేయుట సరికాదనియు, రాజీ పడవలసిందనియూ అన్నారు. కనుక, "సిమ్లా, వైటుహాలుల వైపు" అర్రులు చాచుక కూర్చొన్నది కమ్యూనిస్టులే కాని కాంగ్రెసు నాయకులు కాదని స్పష్టమయిపోయింది. "సెంటరులో" ఎదోరకపు బాధ్యత కావాలని ఉవ్విళ్ళూరింది, కమ్యూనిస్టులేగాని కాంగ్రెసు నాయకులు కాదని తేలిపోయింది.

"యుద్ధ విషయంలో సామ్రాజ్య వాదంతో కాంగ్రెసు రాజీపడితే ప్రపంచ ప్రజాస్వామిక ఉద్యమానికి ద్రోహియూ, భారత జాతీయ ఉద్యమానికి వినాశకారియూ అవుతుందన్న కమ్యూనిస్టులే కాంగ్రెసు క్రిప్సు ప్రతిపాదనలు అంగీకరించి దేశరక్షణ బాధ్యత తీసుకోకపోవడం తప్పని ప్రచారం చేసారు.

అంటే వారి మాటల్లోనే కమ్యూనిస్టుపంథా "భారత జాతీయ ఉద్యమానికి వినాశకారి" అవుతుందని మనం తెల్సుకున్నాం. ఇలాంటి జాతీయ విద్రోహాన్ని కాంగ్రెసు వ్యతిరేకించింది. కాంగ్రెసు సోషలిస్టులుకూడ, కాంగ్రెసు పద్ధతినే అంగీకరించారు. కమ్యూనిస్టులు కాంగ్రెసు పద్ధతిని వ్యతిరేకించారు. అట్టి రాజీ 'డిఫెన్సు ఆఫ్ ఇండియా ఆక్టు' జాతీయ ఉద్యమంపై అమలు జరిపించుతుంది. "పరిశ్రమలలో శాంతి" కావాలను జాతీయ విద్రోహాన్ని పెట్టుబడిదారులకు మద్దతు ఇవ్వాలసి వస్తుంది. రైతుల రక్తం ఒడిసి మద్దతు చేస్తున్న జమీందారులతో కాంగ్రెసు మైత్రిగా మెలగవలసి వుంటుంది. సంస్థానాలలో మంత్రుల దుష్ట పరిపాలనకు తలలూపవలసి వస్తుంది. అభివృద్ధి నిరోధకులగు కులతత్వవాదులతో రాజీ పడవలసి వస్తుంది. రాజీచేసుకుంటే వివిధ శక్తుల విభాగంలో కాంగ్రెసు విప్లవశక్తులకు వ్యతిరేకంగా విద్రోహ శక్తులతో కలసిపోవలసి వస్తుంది. ఇందువల్ల జాతీయ శక్తులలో చీలికలు కలుగుతాయి. కాంగ్రెసు ఎంతో త్యాగంచేసి సంపాదించిన గొప్ప కీర్తిసాంప్రదాయాలు మంటగలసిపోతాయి. ఇలాంటివనినే కమ్యూనిస్టులు చేయమంటున్నారు. అలా చేయనందుకు కాంగ్రెసును దూషిస్తున్నారు. కాని, మేము నిజమైన కాంగ్రెసువాదులమే అంటున్నారు.

# ఆగస్టు తీర్మానం

బర్మా, మలయా, సింగపూరులు జపాను హస్తగతమై పోయినాయి. ఆ దేశాలలోని బ్రిటిషు వలస ప్రభుత్వాలు దేశ రక్షణ జయప్రదంగా సాగించలేక పోయాయి. జాతీయ చైనా, సోవియట్ రష్యాలు వీరోచితంగా తమ దేశ స్వాతంత్ర్యాల్ని రక్షించుకుంటున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో భారతీయులు ఏం చేయాలి? బ్రిటిషు సామ్రాజ్యవాదులే మన దేశాన్ని రక్షిస్తారని చేతులు ముడుచుకొని కూర్చోవాలా?

అలా "ముక్కు మూసుకొని" కూర్చుంటే బర్మా, మలయా, సింగపూరులు ఎలా జపానుస్వాధీనమైపోయినాయో కళ్ళారా చూసాం. జాతీయ ప్రభుత్వము ప్రజలు స్థాపించుకుంటేనేగాని, జాతీయ రక్షణ సాధ్యంకాదని తేలిపోయింది. ఇలాంటప్పుడు కాంగ్రెసు నాయకులు బ్రిటిషుప్రభుత్వాన్ని మరొక సారి అగ్నిపరీక్షకు గురిచేసారు.

"ఏమయ్యా మీరు జపాన్ను ఓడించాలంటే, భారతీయుల్ని బానిస సంకెళ్ళతోనే బంధించి యుద్ధాన్ని జయప్రదంగా నిర్వహించలేరు సోవియట్ రష్యా, చైనాలకు భారత దేశం సానుభూతిని చూపిస్తున్నది. కాని సహాయము చేయడానికి స్వాతంత్రం కావాలి. అంచేత, దేశరక్షణ అధికారంగల

జాతీయ ప్రభుత్వాన్ని ఈ దేశంలో స్థాపించండి. లేదంటారా మేమే జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించుకోడానికి జాతీయ పోరాటాన్ని ప్రారంభిస్తాము." ఈ విధంగా భారత ప్రజావాణిని కాంగ్రెసు వ్యక్తపరచింది అంతేగాని, జాతీయ ప్రభుత్వం కావాలని తీర్మానించి, చేతులు ముడుచుకొని కూర్చోలేదు. ఆ జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించుకోడానికి నిర్ణీతమైన కార్యక్రమాన్ని ఇచ్చారు. ఇదీ సారాంశం.

క్విట్ ఇండియా

ఒక్కమాటలో ఇదే గాంధీజీ "క్విట్ ఇండియా" ఉద్యమం తర్వాత 1942 ఆగస్టు 8 తేదీన బొంబాయి అఖిలభారత కాంగ్రెసు సమావేశంలో అంగీకరించబడిన తీర్మానము అదే. కాం. సో. తీర్మానాన్ని బలపరిచారు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన ఆగస్టు తీర్మానంపట్ల కమ్యూనిస్టుల వైఖరిఎలావుందో గమనిద్దాం. కమ్యూనిస్టులు ఆగస్టు తీర్మానాన్ని వ్యతిరేకించారు.

ఈ సందర్భంలో కమ్యూనిస్టుల అభిప్రాయాలు కొన్ని ఇక్కడ ఉదహరిస్తాను.

కాంగ్రెసువర్కింగు కమిటీ ఫాసిస్టులకు సహాయంచేసే కార్యక్రమానికి దిగింది.

"కాని రోజురోజు మారుతున్న పరిస్థితులవల్లనూ మొదటినుంచి తా మవలంబించిన విధానంవల్లనూ, వారు ఫాసిస్టులకు సహాయంచేసే కార్యక్రమానికి దిగడం తప్పనిసరి అయింది"

(భారత కమ్యూనిస్టుపార్టి సెంట్రల్ కమిటి సమావేశం రాజకీయ తీర్మానాన్ని కామ్రేడ్ అధికారి రిపోర్టు పేజీ 19 లో)

కాంగ్రెసు వర్కింగ్ కమిటి "ఫాసిస్టులకు సహాయంచేసే కార్యక్రమానికి దిగడం తప్పనిసరి అయింది." అని కమ్యూనిస్టు పార్టీ నాయకుడు జి. అధికారి అంటున్నాడు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు కూడ కాంగ్రెసు నాయకత్వం జపానుకు సహాయం చేసే కార్యక్రమాన్నే అవలంబించిం దన్నారు. చూసారా! అధికారి, అమెరీలు ఒకేస్వరంతో పాడుతున్నారు. ఇందుకే కాబోలు, గొప్పవారంతా ఒకేమాదిరిగా ఆలోచిస్తారని ఒక గొప్పవారు అన్నారట.

కాంగ్రెసు మొట్టమొదటినుండి కూడ ఫాసిస్టు వ్యతిరేక కార్యక్రమంతోనే పని చేస్తూ వచ్చింది. మన దేశంలో ముమ్మొందుగా ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం చేసింది. కాంగ్రెసే కమ్యూనిస్టులు 'హిట్లరు' విజయాలను చూచి ఉబ్బి తబ్బిబ్బయిన రోజుల్లో కూడ కాంగ్రెసు ఫాసిస్టు వ్యతిరేక కార్యక్రమంతో పనిచేసిందని గుర్తుకు తెచ్చుకోండి. అందువల్లకమ్యూనిస్టులు కాంగ్రెసుకు ఫాసిస్టు వ్యతిరేకతను నేర్పనక్కర లేదు. పైగా వారు ఫాసిస్టు ప్రమాదానికి కళ్ళు తెరువక మునుపే జపాను వస్తువుల్ని కాంగ్రెసు బహిష్కరించాలని ప్రబోధం చేసింది. అప్పుడు కమ్యూనిస్టులు కాంగ్రెసునుండి ఫాసిస్టువ్యతిరేకతను నేర్చుకో లేదు. కమ్యూనిస్టులకు స్టాలిన్ చెప్పేవరకు ఏదీ

రాదు. సోవియట్ రష్యాపై జర్మనీ దండయాత్రి చేసేవరకు కమ్యూనిస్టులకు ఫాసిస్టు వెనుభూతం కన్పడలేదు, చైనాపై జపాను దురాక్రిమణచేయడం, యూరప్‌లో హిట్లరుదౌష్ట్యాలు కాంగ్రెసు వాదులకు ఫాసిస్టుల ధోరణి బట్టబయలు చేసాయి. ఇలా కాంగ్రెసు ఫాసిస్టువ్యతిరేక సాంప్రిదాయాలలోనే వున్నది. అయినప్పుడు మొదటినుంచీ తాము అవలంబించిన విధానంవల్ల కాంగ్రెసునాయకులు ఫాసిస్టులకు సహాయంచేసే విధానానికి దిగడం తప్ప లేదని అనడంలో ఏమాత్రమూ అర్ధమూ లేదు. కాంగ్రెసుపైగలకార్పణ్యము మాత్రిమేవున్నది. అసలు ఆగస్టు తీర్మానమే సామ్రాజ్యవాదులకు, ఫాసిస్టులకు వ్యతిరేకమైన తీర్మానము. ప్రపంచ ప్రిజాస్వామిక శక్తులకు, జాతీయ ఉద్యమఅభివృద్ధికి, ఆతీర్మానం బలం చేకూరుస్తుంది. కాని కమ్యూనిస్టులు ఆతీర్మానాన్ని వ్యతిరేకించారు. అంటే, ప్రిజాస్వామికాన్ని, స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకించారన్నమాట. వాటి ప్రిబల విరోధులయిన ఫాసిజం, సామ్రాజ్యవాదాలకు బలం చేకూర్చారన్నమాట. ఇంకా వివరంగా ఆలోచిద్దాం. భారతదేశంలో సామ్రాజ్యవాదాన్ని తుదముట్టించడమంటే, బ్రిటనులో ప్రిజాస్వామికశక్తులకు బలం చేకూర్చడమే. కనుడు గట్టిన కన్సర్వేటివ్‌లకు, పెద్దగొడ్డలిపెట్టు అన్నమాట. ఇలా బ్రిటనులో ప్రిజాస్వామికశక్తులు బలపడితే, అంటే బ్రిటనులో ప్రిజాప్రభుత్వం స్థాపన అయితే, సోవియట్ రష్యాకు అలాంటి ప్రజల్లో హృదయపూర్వకంగా సర్వసమ్మతమయిన సహా

యం చేస్తుంది. బ్రిటిషు ప్రజలకూ, సోవియట్ ప్రజలకు అడ్డం కిగావున్న సామ్రాజ్యవాదం నిర్మూలింప బడుతుంది. ఇలా అయితే యూరప్‌లో ప్రజాస్వామిక శక్తులు బలపడటానికి ఎంత అవకాశమున్నదో చూడండి. ఈపద్ధతినే కాంగ్రెసు అవలంబించి ఆగస్టు తీర్మానాన్ని, అంగీకరించింది.

**జాతీయ ప్రభుత్వ స్థాపనకు వ్యతిరేక కార్యక్రమము**

ఇక కమ్యూనిస్టుల ధోరణిచూద్దాము. వారుకూడా జాతీయ ప్రభుత్వము కావాలని కోరుతారు! బ్రిటనులోని ప్రజలకు, సోవియట్ ప్రజలకు మధ్య అడ్డంకిగావున్న సామ్రాజ్యవాదం తొలగించ బడాలని కోరుతారు. కాని ఆచరణలో వారు పూర్తిగా వాటిని వ్యతిరేకమయిన కార్యక్రమముతో పనిచేస్తున్నారు. ఇండియాలోని సామ్రాజ్యవాదానికి పూర్తి సహకారము చేస్తున్నారు. ప్రజలందర్నీ చేయుమంటున్నారు. అంటే ఈ పద్ధతివల్ల మన దేశంలో సామ్రాజ్యవాద ప్రముఖత్వం బలపడుతుంది. అంటే బ్రిటనులోకూడ ఈ సామ్రాజ్యవాదులే బలంగా వుంటారు. అయినప్పుడు ప్రజా ఒత్తిడి వారిని ఏమీ చేయలేదు. కనుక యూరప్‌లో ప్రజాస్వామిక శక్తులకు సామ్రాజ్యవాదులు ప్రమాదం కలిగించగల స్థితిలోవుంటారు. ఉదాహరణము: నేడు గ్రీసులో దేశభక్తులకు బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఏంచేయగలుగుతున్నారో గమనించండి. మన కమ్యూనిస్టులు ప్రజాయుద్ధమంటూ ప్రోత్సా

హించి పంపిన సైనికులతో గ్రీసులో ప్రజా విప్లవాన్ని అణచి వేయడానికి సామ్రాజ్యవాదులచేత వినియోగించబడుతున్నారు ఈవిధంగా కమ్యూనిస్టుల పద్ధతి ప్రజా విప్లవాలకు వినాశం చేయడానికి ఉపయోగపడుతున్నది, కాని కాంగ్రెసు పద్ధతి ప్రజావిప్లవాలకు బలాన్ని చేకూరుస్తుందిగా నున్నది. ఇదే ఆగస్టు తీర్మానంలోవున్న విశిష్టత, అలాగే కమ్యూనిస్టుల పంథా ప్రజాస్వామిక శక్తులను బలహీన పరుస్తూ, ఫాసిస్టులకు సహాయభూతంగా నున్నది.

అంటే సోవియట్ రష్యాకే నష్టం చేకూరుస్తున్నది— ఇదే విధంగా, భారతదేశంలో జాతీయ ప్రభుత్వ స్థాపనకుకూడ వ్యతిరేకమయిన కార్యక్రమంతో పనిచేస్తున్నారు. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి పూర్తి సహకారము చేయడము, జాతీయ ప్రభుత్వాన్ని కోరడము పరస్పర వ్యతిరేకము లయినవి. భారత ప్రజలందరూ బ్రిటిషు ప్రభుత్వానికి పూర్తి మద్దతు ఇస్తూ మాకు జాతీయ ప్రభుత్వం కావాలని కోరితే ఇస్తారా? అలా ఇవ్వవలసిన అవసరము ఏమీలేదు. తమ పరిపాలనా వ్యవహారాలు సాక్షిగా సాగుతున్నంతకాలం మనకు జాతీయ ప్రభుత్వాన్ని యివ్వడానికి బ్రిటిషువారు వెర్రిబాగులువాళ్ళా? అందులో, మనమందరం దానికి సహకారము చేస్తున్నప్పుడు ఆ పరిపాలన సుపరిపాలనే అవుతుంది. అయినప్పుడు ఇక 'స్వపరిపాలన' కోరడ మెందులకు? అసలు బ్రిటిషువారు అసాధ్యులు. సామ్రాజ్యరాజనీతిలో ఆరితేరినదిట్టలు. వారు ఒక విషయా

నికి అంగీకరించినా దానిని చేతిలో నుంచరు. చేతిలో పెట్టారా నోటిదాకా పోనివ్వరు. నోటిదాకాపోయిన మ్రింగుడు పడ నివ్వరు. మ్రింగుడుపడినా జీర్ణం కానివ్వరు. అలాంటివారిముందా లాలింపులు దువ్వులాటలు. ఇప్పటికే అమెరీగారు అంటు న్నారు. 'భారతదేశంలో ప్రజలు యుద్ధానికి సర్వతోముఖంగా సహాయం చేస్తున్నారు. కాంగ్రెసు వారు కలసిరాలేదని భయ పడ నక్కరలేదు. ఇప్పటికే 20 లక్షలమంది తమంతతాముగా స్వచ్ఛందంగా, సైన్యంలో చేరారు' కమ్యూనిస్టులు చేస్తున్న ట్లుగా ప్రజలంతా సామ్రాజ్య తత్వానికి సహాకారము చేస్తే మన కెన్నడూ జాతీయ ప్రభుత్వము రాదు. ఇలా జాతీయ ప్రభుత్వం లేకపోవడమంటే మన దేశంపై దురాక్రమణ చేయ డానికి జపానుకు భలే అవకాశం. అంటే చైనాకు చెప్పరా నంత నష్టం, కనుక భారతప్రజలు, చైనాప్రజలు ఒకే త్రాటి మీద నిలబడి జపాన్ని ప్రతిఘటించి విజయప్రదంగా తమతమ దేశాల్ని రక్షించుకోవాలంటే ఏమికావాలో ఆ జాతీయ ప్రభు త్వస్థాపనకే కమ్యూనిస్టులపంథా వ్యతిరేకముయింది. ఆగస్టు తీర్మానం భారత స్వాతంత్ర్యంతోపాటు; చైనా, రష్యాలకు సహాకారం చేయడానికి అవసరం. ఇలాంటి ఆగస్టు తీర్మానా నికే కమ్యూనిస్టులు వ్యతిరేకులు. ఈ విధంగా, కమ్యూనిస్టుల పంథా పూర్తిగా కాంగ్రెసుకు వ్యతిరేకముగా నున్నది. కాం గ్రెసుకు వ్యతిరేకమంటే, ప్రజాస్వామిక శక్తులకు వ్యతిరేక మన్నమాట. అందుకే చైనా, రష్యాలకూడ వ్యతిరేకముగా

నున్నది. అందుకే విప్లవ ఉద్యమాలను బలపరుస్తున్న కాంగ్రెసు సోషలిస్టులకు వ్యతిరేకముగా నున్నది. ఇది అసలు విషయం. ఇప్పుడయినా తేలుటలేదా ఎవరి పంథా ఫాసిస్టులకు సహాయం చేస్తుందో? మిస్టర్ అధికారి ఏమంటాడో?

అగస్టు తీర్మానాన్ని వ్యతిరేకించిన కమ్యూనిస్టులు ఆగస్టు ఘటనలను కూడ వ్యతిరేకించినారు. కాంగ్రెసు నాయకులను "ఫాసిస్టులకు సహాయపడే కార్యక్రమం" ఇచ్చారన్న కమ్యూనిస్టులే, కాంగ్రెసు సోషలిస్టులు జపాను అనుకూలురనీ పంచమాంగ దళం వారని అంటున్నారంటే అబ్బురపడవలసిన దేమున్నది? కాంగ్రెసు సోషలిస్టులు జపాను ఏజెంట్ల కార్యక్రమంతో పని చేస్తున్నారని ఎవరినీ నమ్మించలేక పోయారు. తద్వ్యతిరేకంగా, 'కమ్యూనిస్టులే' గవర్నమెంటు ఏజెంట్లనీ ప్రభుత్వ బంటులని అందరూ విశ్వసించారు. కమ్యూనిస్టులు చాల అపఖ్యాతి పాలయ్యారు. ప్రజలనుండి పూర్తిగా దూరమయిపోయినారు.

౫

# కాంగ్రెసు సోషలిస్టులపై కమ్యూనిస్టుల దాడి

కమ్యూనిస్టులు ఈనాడు. కాం. సో. పార్టీని పూర్తిగా వ్యతిరేకిస్తున్నారు. కమ్యూనిస్టులు కాంగ్రెసును వ్యతిరేకించుటలో ఒకభాగంగానే కాం. సో. లను ఎదుర్కొంటున్నారని గుర్తించండి. కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో శ్రీజయప్రకాశ నారాయణ, ఆచార్య నరేంద్రదేవ్, రామమనోహర లోహియాలాంటి కాంగ్రెసునాయకులుగా పరిగణింపబడ అర్హత గలవారున్నారు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ మీటింగులకు సయితము కాంగ్రెసు సోషలిస్టులు పార్టీనాయకులు ఆహ్వానింపబడుతున్నారు. కమ్యూనిస్టులు కాం. సో. గాంధీవాదాన్ని ఆచరిస్తున్నారనీ, కాంగ్రెసు ధనాఢ్యవర్గానికి తోకలాగు, మధ్యతరగతిప్రజల్లో పని చేస్తున్నారనీ, వారు సోషలిజానికి తిలోదకాలు ఇచ్చారనీ మొన్న మొన్నటివరకు ప్రచారం చేసారు. కాని కొన్నాళ్ళనుండి, కాం. సో. అక్షరాజ్యాలకుపయోగపడే కార్యక్రమాన్ని అవలంబిస్తున్నారనీ, ఫాసిస్టు ఏజంట్లనీ, కాంగ్రెసు వ్యతిరేక కార్యక్రమాన్నీ, గాంధీజీకి వ్యతిరేకమయిన కార్యక్రమాన్నీ అవలంబిస్తున్నారని దుష్ప్రచారం

చేస్తున్నారు. పై రెండు విమర్శలు పరస్పర వ్యతిరేకంగా వున్నాయి. ఒకప్పుడు కాంగ్రెసుకు అనుకూలురని నిందించుతూ ఇప్పుడు కాంగ్రెసు వ్యతిరేకు లని నిందించుతున్నారు. నిజంగా కాంగ్రెసు సోషలిస్టులు కమ్యూనిస్టు లన్నట్లుగా, ధనాఢ్య వర్గానికి తోకలయితే, కాంగ్రెసు నాయకత్వం ధనాఢ్యుల దయితే, ఈనాడు కమ్యూనిస్టులు కాంగ్రెసుకు అనుకూలురమే నని చెప్పుకుంటున్నారుగదా! అయినప్పుడు ఈనాడు కమ్యూనిస్టులు ధనాఢ్యవర్గానికి తోత్తులయినట్లేనా? అయితే, ఇది వరకు ధనాఢ్యవర్గానికి తొత్తులుగానున్న సోషలిస్టులు ఈనాడు ఆ ధనాఢ్య వర్గానికి ఎందువల్ల వ్యతిరేకమైనారు? దానికి కమ్యూనిస్టు లేమని సమాధానం చెప్తారు? మనము ఖండించనవసరము లేకుండానే కమ్యూనిస్టులు తమవాదనను తామే ఖండించుకున్నారు. తమ నిజరంగు తామే బయట పెట్టుకున్నారు. అసలు విషయం ఏమంటే, కాంగ్రెసు సోషలిస్టులపైన దెబ్బతీయడానికి, ఏదో ఒక వాదన వారికి కావాలి. దానికి అభూతకల్పనలు అవసరమయ్యాయి. అంతేగాని, కాంగ్రెసు సోషలిస్టులు కాంగ్రెసుయెడల అవలంబిస్తున్న పద్ధతిలో ఎలాంటిమార్పు లేదు. కాం. సో. మనజాతీయ ఉద్యమమును ఎల్లప్పుడూ బలపరుస్తూనే వచ్చారు. కాం. సో. కాంగ్రెసును భారతజాతీయ సంస్థగా, సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన కేంద్రంగా గుర్తిస్తారు. జాతీయ ప్రజాస్వామిక

విప్లవాన్ని సాధించడానికి కాంగ్రెసు ఎలా వజ్రాయుధంలా పని చేస్తుందో గుర్తించారు.

కాంగ్రెసు అన్నివర్గాలకలయిక సంస్థగా ఎన్నుకొంటారు. అంతేగాని, ధనాఢ్యుల సంస్థగా ఎన్నడూ చెప్పరు. కాకపోతే, అన్ని వర్గాలకు కాంగ్రెసులో ప్రవేశమున్నది. కనుక దానిలో కూడ ధనాఢ్యు లున్నారని మాత్రం గుర్తిస్తారు. అదికాక ప్రజా సామాన్యం జాగరూకత వహించి, చైతన్యయుతంగా చరించి, కాంగ్రెసు నాయకత్వమును ప్రజా హస్తగతం చేసు కోవాలని హెచ్చరిస్తారు. అంతేగాని, కమ్యూనిస్టులవలె కార్మి కవర్గ నాయకత్వం క్రిందనే జాతీయ పోరాటాలు విజయవ్రదం అవుతాయనీ, అలాంటి కార్మికవర్గనాయకత్వం కాంగ్రెసులో లేదు. కనుక, కాంగ్రెసు విప్లవ వ్యతిరేకమని నమ్మరు. ఎందు వల్లనంటే, కాం. సో. లకు కార్మికులంటే, వారి నాయకత్వం మంటే ఇష్టములేక కాదు. లేక జాతీయ విప్లవంలో కార్మికుల ప్రాముఖ్యత గుర్తించలేక కాదు. వర్గ సంబంధాలు, విప్లవంలో వాటి ప్రాధాన్యత తెలుసుకోలేక కాదు. ఎందు వల్లనంటే కమ్యూనిస్టులవలె ఊహా ప్రపంచంలో నివసించం గనుక. అసాధ్యమయిన పనులు తలపెట్టి భావవీధుల్లో విహారం చేయరు కనుక రియలిస్టులుగానే వ్యవహరించినారు. వాస్తవిక పరిస్థి తుల్ని బట్టి వర్గసంబంధాల్నిబట్టి ప్రవర్తించుకొంటారు. కార్మిక వర్గం ఇండియాలో ఈనాడు ఏలాంటి స్థితిలో వున్నది? జాతీయ పోరాటానికి నాయకత్వం వహించగలిగిన స్థితిలో వున్నదా?

దాని చైతన్యము ఏస్థాయిలో నున్నది. ఇది అర్థం చేసుకొంటూ కార్మికవర్గ పార్టీయని చెప్పుకొంటున్న కమ్యూనిస్టు పార్టీని గూర్చి ఆలోచిద్దాం. ఈ పార్టీలో సభ్యులు నూటికి 80 మంది మధ్యతరగతివాళ్ళు. పార్టీ అయినా చివ్వకో తగినంత బలంగా లేదు. అదికాక, ఇప్పటివరకు నడచిన జాతీయ పోరాటాల్లో ఎంతమంది కార్మికులు పాల్గొన్నారు? ఇవ్వన్నీ ఆలోచిస్తే కార్మికులు జాతీయ పోరాటానికి నాయకత్వం వహించే స్థితిలో లేరని స్పష్టమగుటలేదా? వాస్తవిక పరిస్థితులను గమనించకుండా జాతీయోద్యమంలో కార్మికుల నాయకత్వం కావాలని ఆర్భాటం చేయడము, కమ్యూనిజమా? అదీ కాక, కార్మిక వర్గ నాయకత్వం తయారయ్యేవరకు జాతీయ పోరాటాలు ఆగి పోవలసిందేనా? నిజానికి భారతదేశంలో రైతులే ఈ నాడు ఎక్కువ విప్లవ చైతన్యం పొందివున్నారు. ఇంతవరకు జరిగిన జాతీయ పోరాటాల్లో స్వాతంత్ర్య సంరంభాల్లో, రైతాంగపు యువకులే ఎక్కువగా పాల్గొన్నారు. ఇలా అంటే కమ్యూనిస్టులు కాం. సో. పెట్టీ బూర్జువాలంటారు. కాంగ్రెసులో ప్రజా సామాన్యం పెత్తనం వహించాలని కాం. సో. లు కోర్తారు. అయితే రాయిస్టులవలే 'ఆల్టర్ నేటివ్' నాయకత్వం పేరుతో ఐకసంఘటన విచ్ఛిన్నం గావించరు. భారత జాతీయ ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించడమే వారి ప్రస్తుత కార్యక్రమము విప్లవ నాయకత్వము విప్లవములోనే నిర్మాణమవుతుంది. విప్లవ సందర్భంలో విప్లవ వ్యతిరేక నాయకత్వం ఉండదుగదా? కనుక

ముఖ్యంగా కాం. సో. లు ఇలాంటి వాతావారణాన్ని తీసుకు రావడానికి యత్నిస్తారు. కాంగ్రెసును విప్లవ సారథ్యంవహించ డానికిసన్నద్ధం చేయుటయే వారి ఆశయం కాం. సో. లు ఈ విధంగా కాంగ్రెసులో ప్రజానాయకత్వం వుంటుందని చెప్పు చున్నారు. ఇక ఇండియన్ కమ్యూనిస్టుల్లో, ఇదివరకే చెప్పి నట్లుగా వీరు తమ పాలసీని, ఎత్తుగడలను నిర్ణయించుకోరు. వీరు ఇతరుల నిర్ణయాలు అమలు జరిపేవారు మాత్రమే. నిర్ణయాలు మాత్రం మాస్కో పీఠంనుండి జారీ అవుతుంటాయి. వీరు రష్యాజాతీయతను ఇండియాలో అమలు చేయుడానికి యత్నిం చుటవల్ల మన దేశంలో ఎలిగాకులవలె వుండిపోయారు. కాం.సో. అలా కాకుండా, మన జాతీయ పరిస్థితులను ప్రధానంగా దృష్టిలో వుంచుకొని, అంతర్జాతీయ పరిస్థితులను సమన్వయ పరచి తమ పాలసీలు నిర్ణయించుకుంటారు. వీరు సోవియట్ రష్యావట్ల సానుభూతి, గౌరవాలు, కలవారయినప్పటికీ, కాం. సో. లు రష్యాచేసిన ప్రతిపనిని గుడ్డిగా నమర్థించరు. సోవి యట్ విదేశాంగ రాజనీతిని వీరు సునిశితంగా అనేకసారులు విమర్శించారు. ఇందువల్లనే కాం. సో. సోవియట్ వ్యతిరేకు లని కమ్యూనిస్టులు తప్పుడు ప్రచారం చేస్తున్నారు. కమ్యూ నిస్టులవలె, సోవియట్ అనధికార విదేశాంగ కార్యాలయం వలె కాం. సో. పనిచేయరు. చిత్రమేమంటే, మనదేశంలోని మనకాంగ్రెసు మంత్రివర్గాల్ని, వాటి పాలనావద్ధతులను తీవ్ర విమర్శకు గురిచేయుడము, అప్పుడప్పుడు, చిక్కులు కల్పించ

డము కమ్యూనిస్టులకు ఇష్టమేకాని, వారిదృష్టిలో అవుసరమే గాని, సోవియట్ రష్యా రాజనీతిని విమర్శించడం మాత్రం వీరికి గిట్టదు. వీరిదృష్టిలో అనవసరము, అంతేగాదు, అలా చేసినవారు సోషలిజానికే ద్రోహులట. దీనినిబట్టి కమ్యూనిస్టులకు కాంగ్రెసు సోషలిస్టులకుగల తారతమ్యం తెలుసుకోవచ్చును. ఆశ్చర్యమేమంటే, ఇండియన్ కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టుపార్టీని అర్గనైజు చేయుడానికి ముందు వ్యతిరేకత తెల్పినారు.

బ్రిటిషు కమ్యూనిస్టు నాయకుడు రజనీపామీదత్తు కాం. సో. పార్టీ ఫాసిస్టుల్లా తయారవుతుందని జోస్యం చెప్పాడు. కాని, తర్వాత ప్లేటుఫిరాయించి కాం. సో. పార్టీలో తాముకూడ చేరారు! చేరారన్మాటేగాని, కాం. సో. పార్టీ నిర్ణయాలను ఆచరణలో పెట్టుట మానేసి, తమపార్టీ నిర్ణయాలను ఆచరణలో పెట్టుటకు యత్నించేవారు. దీంతో కాం. సో. పార్టీ ఆఫీసుకు వీరిపై రిపోర్టులురా మొదలెట్టాయి. సక్రమ విచారణ జరిగిన మీదట, కమ్యూనిస్టులను కాం. సో. పార్టీ నుండి వెళ్ళగొట్టారు. వాస్తవానికి కమ్యూనిస్టులు తమ పార్టీనిషేధంలో వున్నదిగనుక, తమపార్టీ కార్యక్రమాన్ని కాం. సో. పార్టీ పేరుతో ప్రచారం చేసుకోవచ్చునని ఉబలాటపడ్డారు. కాని కాం. సో. ఈ తంతుగ్రహించి, కాం. సో. పార్టీ విప్లవ కార్యక్రమంతో పనిచేసే మార్క్సిస్టుపార్టీ గనుక దానిలో ఎంతో క్రమశిక్షణ అవుసరమని దాని సభ్యులంతా ఏకాభి

ప్రియాలతో పార్టీ నిర్ణయాలను, కార్యక్రమాన్ని, ఆచర ణలో పెట్టగలిగి నప్పుడే నిజమైన విప్లవపార్టీగా కాం. సో. పార్టీ తయారవుతుందనీ లేకపోతే కలగాపులగంగా వుంటే సందిగ్ధంగా పనిచేస్తూవుంటే నిర్వీర్యంగా వుంటుందని వివరిస్తూ, ఒకే వ్యక్తి రెండుపార్టీలకు లాయల్ గా పనిచేయడము అసంభ వమని, కనుక కమ్యూనిస్టుపార్టీలోని సభ్యులు కాం. సో. పార్టీలో పనిచేయడానికి అనర్హులని తెలియచేసారు. మొత్తం మీద కమ్యూనిస్టులు కాం. సో. పార్టీకి చాల ద్రోహం చేసారు. ఎలాగంటే, కమ్యూనిస్టులు కాంగ్రెసు పట్ల అవలం బించిన పైఖరిలో కాం. సో. పార్టీ పేరుతో అలా ప్రవర్తిం చుటవల్ల, ప్రజలలో కాం. సో. పార్టీ దృక్పథముపట్లకూడ సంశయాలు పొడచూపాయి. అంతేకాదు. కాం. సో. పార్టీ పేరుతో కమ్యూనిస్టులు కొంత బలపడ్డారుకూడ. ఈద్రోహం, మోసం, ఆంధ్ర, కేరళ, తమిళనాడులలో కమ్యూనిస్టులే కాం. సో. పార్టీ బురఖాతో పనిచేయుటవల్ల ఆమూడురాష్ట్రా లలోని కాం. సో. పార్టీ లే కమ్యూనిస్టుపార్టీలో కలిసిపోయాయి. ఇలా రెనిగేడ్సు గోముఖవ్యాఘ్రాలలా ప్రవర్తించారు. కాం గ్రెసు మంత్రివర్గపు రోజుల్లో కూడ ఈ రెనిగేడ్లే కొంత బల పడ్డారు. కాని జాతీయ రాజకీయాల్లో కాం. సో. కున్న ప్రాధా న్యత వీరికి లేదు. యం. యన్. రాయికూడ, మొదట్లో కాం.సో. పార్టీ నిర్మాణానికి వ్యతిరేకి. అతడు చెప్పేదేమంటే, ప్రపంచ మంతటిలోనూ, సోషలిస్టు పార్టీలు విప్లవవ్యతిరేక పక్షాలుగా

పనిచేసాయి. కనుక, కాం. సో. పార్టీ పేరు విప్లవ సాంప్రదా యం కలదిగాదు. అదేగాక, కాంగ్రెస్సులోనే కాం. సో. పార్టీ ఆర్గనైజు చేయుడము పనికిరాదు. ఎందువల్లనంటే, అట్లాచేస్తే, కాంగ్రెసు బలహీన పడుతుంది. అంతేగాక, కాం. సో. పార్టీ కూడ కాంగ్రెసులోనే వుండి మార్క్సిస్టు పార్టీగా పనిచేయ లేదు. అందుకని ఈయన కాం. సో. పార్టీని తీవ్రవాదుల పార్టీగానే గుర్తించాడుకాని, దానిని మార్క్సిస్టుపార్టీగా పరి గణించ నిరాకరించాడు. కాని, అనుభవంలో మనకు అర్ధ మయిన దేమంటే, 1934 లో కాం. సో. పార్టీ పుట్టినప్పటి నుండి, నేటివరకు కాంగ్రెసును బలహీన పర్చలేదు. సరికదా కాంగ్రెసు చాల బలపడింది. కాంగ్రెసు నాయకులలో ఎవరూ కూడ కాం. సో. పార్టీ నిర్మాణము కాంగ్రెసులో జరిగినందున, కాంగ్రెసు బలహీన పడిందని ఆరోపణ చేయలేదు. పైపెచ్చు, డాక్టరు పట్టాభి 'గాంధిజం' అను పుస్తకంలో కాంగ్రెసు సోష లిస్టుపార్టీని కాంగ్రెసులోనే నిర్మిస్తున్నందుకు ఆపార్టీ నాయకు లను అభినందించాడు. ఇహాపోతే కాం. సో. పార్టీ మార్క్సిస్టు పార్టీవలె పనిచేయ లేదని రాయిగా రంటున్నారు. మార్క్సి జాన్ని రాయిగారి వ్యాఖ్యానప్రకారం అనగా రాయిజంను మాత్రం కాం. సో. పార్టీ ఆదర్శంగా తీసుకొని, రాయిస్టు పార్టీగా పనిచేయ లేదంటే అది నిజమే. కమ్యూనిస్టులుకూడ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, సోషలిజానికి తిలోదకాలు ఇచ్చిం దని ప్రచారం చేస్తున్నారు. సోషలిజం అంటే రష్యన్ జాతీయ

తన ఇండియాలో అమలు జరపడమే అయితే అలాంటి సోషలిజానికి గుడ్ బై అన్నారు కాం. సో. లు. ఇంత కాం. సో. లనుగూర్చి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే వారు జాతీయ ఉద్యమాన్ని బలపరచినారు గనుకనే. అదిగాక కమ్యూనిస్టులు కాం. సో. లపై ఈనాడు తమశక్తినంతా కేంద్రీకరించి ఎదుర్కొంటున్నారు. కాంగ్రెసువాదులనుండి కాం. సో. లను దూరంచేయాలని చాలా ప్రయత్నాలు చేస్తున్నారు. అందువల్ల కాం. సో. లపై కమ్యూనిస్టులు సాగిస్తున్నదాడి కాంగ్రెసుపై సాగిస్తున్న దాడిగనే భావించాలని మనవి చేస్తున్నాము. అందుచే ప్రతికాంగ్రెసువాది ఈప్రచారాన్ని ఎదుర్కోవాలి.

---

౬

# ఫార్వర్డుబ్లాక్ పై కమ్యూనిస్టులదాడి

జాతీయకాంగ్రెసులో శ్రీసుభాసుబోసు తీవ్రజాతీయవాదులకు నాయకుడుగా మితవాదపోకడలను యెదిరించి, బ్రిటిషుగవర్నమెంటుకు 'అల్టిమేటమ్' యివ్వటముద్వారా ప్రజానీకపు చైతన్యాన్ని పెంపొందజేసి జాతీయసంరంభానికి సన్నిద్ధుల నివ్వాలని హెచ్చరికచేశాడు. దురదృష్టవశాత్తు ఆయన ప్రతిపాదించిన కార్యక్రమాన్ని జాతీయనాయకత్వం ఆనాడు అంగీకరించజాలకపోయింది. కలకత్తాకాంగ్రెసు అనంతరము జాతీయక్షోభ యేర్పడింది. జాతీయనాయకత్వంలో విచ్ఛిన్నపోకడలు బయలుదేరాయి. శృతిమించి రాగానపడి శ్రీసుభాసుబాబుపై క్రమశిక్షణచర్య గైకొనబడింది. ఇంతటతో బోసు మహాశయుడు నిరుత్సాహపడక మందకొడిగానున్న కాంగ్రెసు నాయకత్వాన్ని ముందడుగువేయించాలని దేశంలో పోరాట వాతావరణాన్ని యేర్పరచాలని ఆమహోజ్వలజాతీయసంరంభంలోతన తీవ్రజాతీయవాదబృందం అగ్రగాములుగా వుండాలనే తలంపుతో 'ఫార్వర్డుబ్లాక్' అనుపేర అతివాదుల నందరిని ఒకేప్లాటుఫారంమీద సమీకరించుటకై ప్రయత్నాలు ప్రారంభించాడు. ఈసందర్భంలో కమ్యూనిస్టులవైఖరి గమనించాలి.

కమ్యూనిస్టుల వైఖరి

కాంగ్రెసుఅధ్యక్ష ఎన్నికలలో కమ్యూనిస్టులు సుభాసును బలపర్చారు. అతివాదులందరు యేకోన్ముఖంగా మితవాదులను యెదుర్కోవాలని మితిమీంచి ప్రయత్నం చేశారు. అట్టి అతివాదుల ఐక్యసంఘటనకు ఫార్వర్డుబ్లాక్ కృషిచేయ సంకల్పించినపుడు దానిని విచ్ఛిన్నం చేయటానికి ప్రయత్నంచేసినవారు యీ ప్రబుద్ధులే. ఫార్వర్డుబ్లాక్ తీవ్రజాతీయవాదుల పార్టీగానే పనిచేయాలన్నారు. లెఫ్టుకన్సాలిడేషన్ కమిటీయనుపేర వేరొకసంఘాన్ని యేర్పరచాలన్నారు. తీరా అది యేర్పడినతరువాత పాక్షికదృష్టితో పార్టీప్రాబల్యానికై ప్రాకులాడారు. వీరికి రాయిస్టులు చేదోడువాదోడుగా పని జేశారు; దానితో అతివాదసంఘటనకమిటీ మూలబడింది. సుభాసుబోసునాయకత్వంకోసమై ప్రాకులాడే అవకాశవాది యని గుసగుసలు ప్రారంభించారు. పోరాటానికై బోసుచేసే హంగామా అప్రయోజనమని అవహేళనజేశారు. కలకత్తాలో హాల్వెల్ సత్యాగ్రహం ప్రారంభించటంద్వారా విప్లవవాతావరణాన్ని కలుగజేయటానికి ప్రయత్నిస్తుంటే కమ్యూనిస్టులు ప్రతిఘటించారు. కలకత్తాకార్పొరేషన్‌లో ముస్లింలీగుతో సంబంధపెట్టుకున్నాడని అవాకులు చవాకులువేసి అవకాశవాదిగా చిత్రించారు. బోసురాజకీయాలు జాతీయ విచ్ఛిన్నతకు దారితీస్తాయని పేర్లల్ కాంగ్రెసు (పోటీకాంగ్రెసు) పెట్టడానికై యత్నిస్తున్నాడని నిందించారు.

బెంగాలు రాజకీయాలలో అద్వితీయమైన స్థానాన్ని సుభాసుబాబు పొందగలిగాడు. బెంగాలుగవర్నమెంటు బోసు పేరు చెబితే హడలిపోయేది. యుద్ధం ప్రారంభమైన కొన్నినెలలకు ఆ బెంగాలుసింగాన్ని బ్రిటిషుప్రభువులు బంధించారు. ఆమహావీరుడు జైలుకవాటాలమధ్య నిరసనవ్రతాన్ని సాగించాడు. దేశమంతా ఆందోళనచెందింది. వేరుమార్గంలేక ప్రభుత్వం విడుదలచేసి బందోబస్తులో స్వగృహములో నిర్బంధించింది.

యూరోపియన్ రాజ్యాలన్నింటిలోను సుభాసుబాబు యిదివరకే పర్యటనచేశాడు. ఆధునిక రాజనీతిలో ఆరితేరిన దిట్టగా తయారయ్యాడు. దేశస్వాతంత్ర్యానికై అతివాస్తవికమైనపంథాను అనుసరించాలని నిర్ణయం చేసుకున్నాడు. అలాంటి సునయము బంగారవుఅదను యుద్ధానసమయంలోనే సంప్రాప్తమవుతుందని పూర్తిగా విశ్వసించాడు. మనశత్రువు యిరుకాటంలో వున్నపుడే వాడిపని పట్టాలని ఆయన అభిమతం. మనశత్రువుకు ఆగర్భశత్రువులైనవారితో వ్యవహారం చేసుకోవటం రాజనీతిగా భావించేవాడు.

ఇలాంటిభావాలుగల సుభాసుబాబు ప్రపంచయుద్ధం ప్రచండంగా ప్రజ్వరిల్లినసమయంలో — బ్రిటిషుసామ్రాజ్యవాదులు చరిత్రలో మున్నెన్నడూ కనివినిఎరుగని యిబ్బందిలోనున్నపుడు దెబ్బతీయాలనే తలంపుతో వజ్రసంకల్పుడై కార్యసాధనకు పూనుకొన్నాడు.

యేదారిని యెవరినహాయంతో యేకాలములో యీ పవిత్రభారతభూమిని అమాన్యుడైన దేశభక్తుడు వీడినాడో యెవ్వడు జపాను చేరినాడో జర్మనీ పోయినాడో వివరాలు మనకిప్పు డంతగా తెలియవుగాని మున్ముందు చరిత్రలో మరు పురాని ఘట్టాలుగా చిత్రిత మవుతాయి.

అహోరాత్రులు, అహర్నిశాలూ, విశ్రాంతియెరుగని కృషిచేసి సుప్రసిద్ధమైన 'అజాద్ హింద్ ఫౌజ్' [భారత జాతీయ సేన] నిర్మాణాం అపూర్వంగా యెలా జరిగిందో పత్రికలలో చదివి మనం చకితులమయ్యాము. వారి దేశభక్తినిగాని ధైర్య సాహసాలనుగాని వర్ణనాతీతములు. ఢిల్లీ యెర్రకోటలో షా నవాజ్ ప్రభృతుల కోర్టుమార్షల్ మనకన్నులకు కట్టినట్లు జాతీయసేన వీరగాథలను స్పష్టీకరణ చేసింది.

ఇటు మన దేశములో బోసు అనుచరులు ఫార్వర్డుబ్లాకు ద్వారా జాతీయపోరాటానికి నమకూరుట చూచి ప్రభుత్వము ఫార్వర్డుబ్లాకుపై నిషేధము ప్రకటించింది. ప్రముఖ ఫార్వర్డు బ్లాక్ సభ్యులను అరెస్టు జేసింది. ఇదంతా ఆగస్టు విప్లవానికి ముందే జరిగినకాండ. ఆగస్టు విప్లవతరుణములో ఫార్వర్డుబ్లాకు యోధులు అనేకకష్టనష్టాలకు గురియై త్యాగధనులై పోరా టంలో నిమగ్నులయ్యారు.

ఇదే సందర్భంలో భారత కమ్యూనిస్టులు సుభాసు బాబును దేశద్రోహి చిత్రించి జపాన్ యేజంటని టోజోబం ట్రోతని అతి నీచంగా వర్ణించుచూ పత్రికలలో, ప్లాట్‌ఫారం

పై ప్రచారం చేశారు. అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి పి. సి. జోషీ పీపుల్స్‌వార్ అను పత్రికలో యిలావ్రాశాడు. "సుభాసుబోసు దేశద్రోహి, అతడ్ని బెంగాల్ ప్రజలు, భారతదేశ ప్రజలు పూలహారాలతో సన్మానించేబదులు తుపాకిగుండ్లతో యెదుర్కొంటారు" అదే పత్రికలో ఒక వ్యంగ చిత్రములో టోజోబొమ్మనువేసి అతని పాదాలదగ్గిర పడిగాపులు పడి బోసు అఘోరిస్తున్నట్లుగా వికృతంగా చిత్రించారు. ఈ విధంగా ఆ మహావీరుణ్ని దేశద్రోహిగా చిత్రిస్తూ యీదేశములోని ఆయన అనుచరులను అదే ధ్వారణిలో జపాను యేజంట్లని పేరుపేరునా ప్రచారంగావించారు. ఫార్వర్డ్ బ్లాకు వారంతా చోకబారు దేశభక్తులని త్రోవదప్పిన దేశభక్తులని అర్థరహితంగా ప్రేలార్చు. ఈ విధంగా సోదరరాజకీయపార్టీ నిషేధములోనున్న సమయాన ఆసంస్థ పేరెన్నికగన్ననాయకులు జైలులోనున్న సందర్భములో తాము లీగల్‌గా వ్యవహరిస్తూ దాడి జేశారంటే వీరిలో రాజకీయ నిజాయితీ యే మాత్రంలేదని అర్థమవుతుంది. ముందు ప్రకరణలో కాంగ్రెసు సోషలిస్టులపైన వారు యే విధంగా దాడి చేశారో వివరించాము. జాతీయకాంగ్రెసులో అంతర్భాగములైన ఫార్వర్డ్ బ్లాకు కాంగ్రెసు సోషలిస్టుపార్టీలు విప్లవపక్షాలుగా ప్రజలు గుర్తించారు. ఆపార్టీల నాయకులకు ప్రజానీకం బ్రహ్మరథం పడుతూంది. నమస్కార్యాలు అర్పిస్తూంది.

భారత కమ్యూనిస్టులుమాత్రం బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ ప్రముఖుడు రజనీపామీదత్తు ప్లేట్ ఫిరాయించి బోసు జపాను ఏజంటుకాదు భారత స్వాతంత్ర్యసాధనకు సమకట్టిన యోధుడేనని చెప్పేవరకు కన్నులు తెరువలేదు. ఇప్పుడైనా సగంకన్నులు మాత్రమే తెరచి నిద్రావస్థలోనేవుండి బోసు వీరులను త్రోవదప్పిన దేశభక్తులని అంటున్నారు. అవురా! కాలమహిమ, ఎంతగొప్ప బిరుదులు బోసువీరులకు లభించాయి! త్రోవదప్పిన దేశభక్తులు! గోముఖవ్యాఘ్రాలు! ఈ మాట ఎలావుంది?

೭

# ఆగస్టు విప్లవం - కమ్యూనిస్టులు

1942 ఆగస్టు 9 తేదీని జాతీయ నాయకులు నిర్బంధించబడ్డారు. భారతజాతి ఈ అవమానాన్ని భరించలేక పోయింది. ప్రజలంతా తమ నిరసన తెల్పారు. ప్రభుత్వం ప్రజలను దెబ్బకొట్టింది. తుపాకులు లాఠీలు ప్రయోగించింది. ఇలా ప్రభుత్వ తీవ్రనిర్బంధవిధానం జోరుగా సాగుతున్నది. ప్రజలు ఆత్మరక్షణను పూనుకున్నారు. ఇలా అనేకులు స్వాతంత్ర్యబలిపీఠముందు ఆత్మబలి చేసుకున్నారు. వారు చిరంజీవులు, చిరస్మరణీయులు. అలాంటివారికివే జేజేలు. ఇంకా వేలకొలది వికలాంగులయ్యారు. సుమారు లక్షమంది అయినా అరెస్టయి వుండవచ్చును. ఇంకా కొంతమంది జైళ్ళలోనే స్వాతంత్ర్యంకొరకు నశసిపోయారు. ఆ రోజుల్లో ఎటుచూచినా హాహాకారాలు, ఆక్రిందనాలు, కొరడాదెబ్బలు, తుపాకికాల్పులు, దీర్ఘకాల శిక్షలు, ఉరికంబాల కౌగలింతలు, జాతీయ విప్లవశక్తులు విజృంభించినాయి.

ఇలా ప్రభుత్వం "సింహాబలం"తో ప్రజలపై విజృంభిస్తే ఆత్మరక్షణకై సన్నద్ధులై స్వాతంత్ర్య వాయువుల్ని పీల్చారు. చరిత్రలో ఎన్నడు కని విని ఎరుగని ఘట్టాలు వర్ణించవచ్చు.

కాని యిది సమయం కాదు. ఆరోజుల్లో జరిగిన అన్ని ఘటనలను మనం బలపర్చలేకపోవచ్చు. అది వేరే విషయం. కాని అవి దేశద్రోహులు చేస్తారని కాని, జపాను ఏజంట్లు చేయించారని కాని, పంచమాంగదళ ప్రోద్బలంవల్ల జరిగినాయని కాని, ఏ కాంగ్రెసు వాది అన్నాడు? నిజమే. ఆఘటనలకు కాంగ్రెసు ఎలాంటి బాధ్యత వహించలేదు. ప్రభుత్వ నిర్బంధ విధానమే బాధ్యత వహిస్తుందని గాంధీజీయే చెప్పి యున్నారు. ఈ సందర్భంలో కమ్యూనిస్టుల అభిప్రాయాలు ఎలా వున్నాయో చూద్దాం.

పైవాక్యాలు కమ్యూనిస్టులు కాంగ్రెసు (17 పేజీ) అనుజోషీవ్యాసంలోనివి

"ఆ దౌర్జన్యాం, విధ్వంసక చర్యలు, అన్నివైపుల వ్యాపించకుండా నిరోధించడానికి, మాశాయ శక్తుల ప్రయత్నించాం. వాటిని ఆర్గనైజు చేసినవారి విషకౌగిలినుండి అనేకమంది యువకులను రక్షించాము. అరాజకోద్యమం కార్యక్రమమని బూకరిస్తూ, కాంగ్రెసు పేరుతో వలుకుబడి సంపాదించుకొంటున్న వారిని బట్టబయలు వర్చాం.

జోషీ "అరాజకోద్యమం కాంగ్రెసు కార్యక్రమమని" ఎవరో బూకరించారని అంటున్నాడు. ఎవరెవరో చూడండి.

అరాజకం, కాంగ్రెసు నాయకత్వం.

అఖిల భారత కాంగ్రెసు కమిటీలో స్పష్టమైన కార్యక్రమ మేదీ యివ్వబడనందున, ఆటుపిమ్మట జరిగిన ఘటనలన్నీ వట్టి అరాచక చర్యలేనని, కాంగ్రెసు నాయ

కత్వానికి ఈ అరాజక చర్యలకు ఎట్టి సంబంధము లేదని, అనే కులు భావిస్తున్నారు. ఇది సరికాదు. మొదటి రెండురోజులలో జరిగిన ఘటనలు ఎట్టి కార్యక్రమం లేని అరాచకపు చర్యలే నని చెప్పవచ్చు. కాని అటుపిమ్మట ఆ ఉద్యమంలో కొందరు ప్రవేశించి, దానికి స్పష్టమైన స్వరూపాన్ని యిచ్చారు. కాంగ్రెసు నాయకత్వంలో రెండవ ముఠాకు చెందిన రాజేంద్ర ప్రసాద్, పటేల్, గాంధీజీ మొదలైన వారు సూచించిన స్వరూపమే దేశంలో వ్యాపించింది. కాబట్టి నేటి పోరాటం యొక్క ప్రధాన కార్యక్రమాన్ని యిదివరకే కాంగ్రెసు నాయకత్వంలో ఒక ముఠా అంగీకరించింది. ఈ పోరాటాన్ని పరిశీలించేటప్పుడు ముఖ్యంగా మనం గమనించవలసిన విషయాలు—దాని స్వభావమేమిటి? దాని నినాదాలు ఎత్తుగడలు ఏమిటి? దానిముఖ్యమైన ఎత్తుగడ ఏమంటే, రాకపోక మార్గాలను, రహదారులను, ఉత్పత్తిని స్తంభింపజేయడం. ఈవిధంగా జేసి, ప్రభుత్వాన్ని గట్టిదెబ్బ తీసి, ప్రజా ప్రతినిధులతో రాజీ పడటానికి దిగివచ్చేటట్లు చేస్తామని ఆశ.

తీర్మానంలో రివ పేరా చదవండి. అందులో కాంగ్రెసు వాదుల ప్రధాన నినాదాలున్నాయి. పోరాటాని కీయబడిన కార్యక్రమంవల్ల (1) రాకపోకమార్గాలు, ఉత్పత్తి స్థంభిస్తాయి. (2) అరాజకం వ్యాపిస్తుంది.

ఇది కార్యక్రమానికిమూలం. ఏమంటే, ఇది బ్రిటిషు ప్రభుత్వపు యుద్ధమేనని వారుభావించడం. ఈవిషయాన్ని

మనం స్పష్టంగా గ్రహించాలి. ఎందువల్లనంటే, ఈ విధంగా ప్రారంభించి వాదిస్తేనే కాంగ్రెసువాదుల్ని మనం ప్రస్తుత పంథానుండి మార్చ గలుగుతాం" ఈవాక్యాలు ఇండియా ప్రభుత్వం తరఫున టాటెన్హాం ప్రకటించిన కరపత్రింలోనివి కావు! భారతకమ్యూనిస్టుపార్టీ, సెంట్రలుకమిటీ సమావేశంలో "రాజకీయ తీర్మానంపై క్రామేడు అధికారి రిపోర్టులో (పేజీ 19 20 లలో) ప్రజాశక్తి ప్రచురణ నం. 7)

గమనించారా! కమ్యూనిస్టుల ప్రచారపద్ధతులలో ఎంతమోస మున్నదో. వాటంవారీగా పోతూవుంటారు. రాజకీయాల్లో నీతి నియమాలు అక్కర లేదని వారివుద్దేశం. లేకుంటే ఒకవైపున కాంగ్రెసు, అరాచక చర్యలకు ఎలాంటి సంబంధం లేదని అంటూనే, మరోవంక కాంగ్రెసు నాయకత్వమే నిర్ణయించిన పద్ధతిలో ఉద్యమం నడిచిందని చెపుతున్నారు. ఇందులో ఏది నిజము?

పోతే కాంగ్రెసునాయకులు నిర్బంధించబడిన తరువాత కమ్యూనిస్టులు ఎలా తమ ప్రచారాన్ని సాగించారో గమనిద్దాం. ఎలా వారు జాతీయోద్యమాన్ని మంటగలపడానికి ఉద్యుక్తు లయ్యారో చూద్దాం. వారు కాంగ్రెసును ఎలా ప్రతిఘటించారో తెలుస్తుంది. కాంగ్రెసును ఎదుర్కొనికూడ మనం నిలబడగలిగామని వ్రాశారు. భారతకమ్యూనిస్టుపార్టీ ప్రథమ కాంగ్రెసు సమావేశంలో జోషీ రిపోర్టులో ఏమంటున్నాడో చూడండి (పేజీ 4, 5) "మనదేశంలో ఇంతవరకు ఏజాతీయ

సంస్థకూడ కాంగ్రెసుచే ఎదుర్కొనబడి నిలబడినదిలేదు. మన పాలసీ నిజమయిన దేశభక్తి యుతమైనది. కాంగ్రెసు పాలసీ కంటే ప్రతిభావంతమైనది. కనుకనే మనమాధాటీకి నిలబడ గలిగినాము. మనపై దాడి సల్పడంలో కాంగ్రెసు నిజంగా పొరపడింది. కాని మనమాదాడివల్ల ఎంతమాత్రం బలహీన పడలేదు. పోగా మరింత బలపడ్డాం."

(కమ్యూనిస్టులు కాంగ్రెసు పేజి 14)

కాంగ్రెసు నాయకులంతా, ముఖ్యులంతా జైళ్ళలో వున్న తరుణంలో, కాంగ్రెసు పేరు చెపితేనే కారాగారం ప్రాప్తించేరోజుల్లో, కాంగ్రెసు అజ్ఞాతవాసంలోవున్న తరుణములో కాంగ్రెసు కమ్యూనిస్టులపై దాడి చేసిందని జోషీ అంటున్నాడు. ఏమూర్ఖుడు నమ్మతాడో ఈ విషప్రచారం? నిజమేమంటే కాంగ్రెసు ఇబ్బందిలోనున్న సమయం చూసుకొని ఇదే మంచిసమయం. "భలే మంచి బేరముసి" కమ్యూనిస్టులే వివరీతంగా బలపడదామన్న అడియాసలతోనే కాంగ్రెసునే ఎదుర్కొన్నారు. ఇది అసలు విషయం. ఇది జోషి అంతరాత్మకు మాత్రం తెలియదా? మిష్టర్ జోషీ ఆత్మవంచన చేసుకోడానికి విపరీతంగాప్రయత్నం చేస్తున్నాడు. 'పోగామరింత బలపడ్డాం అంటున్నాడు' జోషి. పాపం అమాయకత్వం! అదిబలం కాదు. అదివాపుమాత్రమే. ఎందుకీవారిభ్రమలు, పార్టీ బలానైనా ఎలా అంచనావేయాలో జోషీకి యింకా తెలియదో లేక

తెలిసికూడా అబద్ధాలుఆడుగున్నాడో, ఈవిషయం మనకన్న జోషీకే బాగా తెలుస్తుంది. ఏపార్టిగాని పిలుపుయిస్తే ఎంత మంది ప్రజలు ఆపార్టీని అనుసరిస్తారో అన్నదాన్నిబట్టే ఆపార్టీ బలాన్ని అంచనా వేస్తారు. అంతేగాని పార్టీ సభ్యత్వం పెరిగి నంత మాత్రాన బలమనుకొని మురిసిపడితే ఏం లాభం? ప్రస్తుత కమ్యూనిస్టు పాలసీ "ప్రజాయుద్ధం" అను ఇరుసు చుట్టూ తిరుగుతున్నది. అట్టి ప్రజాయుద్ధాన్ని గూర్చి ప్రజలు ఏమను కొంటున్నారో ఆలోచించండి. జోషీ మాటల్లోనే "కమ్యూనిస్టులు కానివారంతా మా నిర్వచనాన్ని అంగీకరిస్తా రని నే నెన్నడు ఆశించ లేదు."

కనుక కమ్యూనిస్టులు మహాపార్టీ పాలసీని ప్రజ లెవ్వరు అంగీకరించడం లేదని వారే అంగీకరించక తప్పింది కాదు. ఇలాంటివారు పూర్తిగా ప్రజలనుండి దూరమైనారని తేలుట లేదా? ఇట్టిదే బలమని జోషీ భ్రమపడుతున్నట్లు, కాంగ్రెసు పైకి తన అనుచరుల్ని దాడిచేయమని ఎలా జోషీ హెచ్చరిస్తున్నాడో చూడండి. "కాంగ్రెసు నాయకుల పాలసీ నిర్మాణ రహితమైనదని, బట్టబయలు చేయలేకపోవడం; నిరం కుశాధి కారులను బట్టబయలు చేయడానికి, తిట్టడానికి శక్తి నంతా కేంద్రీకరించడం, ఇవే మన పొరపాటు దృక్పథానికి మూలం" భారత కమ్యూనిస్టుపార్టీ ప్రథమ కాంగ్రెసు సమా వేశంలో అంగీకరించబడిన రాజకీయ తీర్మానం చూడండి [పేజీ 18]

దీనినిబట్టి అయినా స్పష్టపడుట లేదా జోషీవర్గమే కాంగ్రెసుపై దాడి చేయుడానికి ప్రయత్నించి, మేరు పర్వతాన్ని ఢీకొన్న పొట్టేళ్ళచందాన తలకు గాయాలంటించు కున్నారు. అదే సమయంలో సామ్రాజ్యవాదుల అనుగ్రహాన్ని సంపాదించడానికై ప్రభుత్వ జోహుకుంలవలె నిరంకుశాధికారులను బట్టబయలు చేయుడానికి, తిట్టడానికి శక్తినంతా కేంద్రీకరించటం తప్పుటూ తన అనుచరులకు దగా మంత్రాన్ని ప్రబోధం చేస్తున్నాడు. కాంగ్రెసు నాయకులపైన శక్తి కేంద్రీకరించాలి. ప్రభుత్వంపైన కాదు, అని చెప్పువారు శత్రు శిబిరంలో వారే కాని మనవారు కాజాలరు. ఇదే జోషీగారి నిజరంగు.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు కమ్యూనిస్టుల రోకంటిపాట.

(భారత కమ్యూనిస్టుపార్టీ ప్రథమ కాంగ్రెసు సమావేశం. రాజకీయ తీర్మానము పేజీ 11)

“మన జాతీయ నాయకులిచ్చిన వినాశకరమైన నాయకత్వం యిందుకు చాలవరకు తోడ్పడింది. విదేశ దండయాత్రకు ఇంతకంటే అనుకూలమైన పరిస్థితులుండబోవు. దేశం సర్వం నాశనం కావడానికి సిద్ధంగా వున్నది”

క్లుప్తంగా చెప్పాలంటే! కమ్యూనిస్టుల దృష్టిలో మన జాతీయనాయకుల ధోరణి విదేశీ దండయాత్రకు అనుకూల పరిస్థితులను ఏర్పరచిందని బ్రిటిషు సామ్రాజ్య వాదులు ఇదే

సమయంలో బ్రిటిషు అమెరికన్ ప్రజల ఎదుట తామూ కాం గ్రెసుపై ప్రారంభించిన నిర్బంధవిధానాన్ని సమర్థించుకోడానికి కాంగ్రెసు సంస్థ జపానుతో రాజీ చేసుకునే ఉద్దేశంతో జాతీయప్రభుత్వాన్ని కోరుచున్నదని, కాంగ్రెసు పంచమాంగ దళ సంస్థ అని లోకం ఎదుటచిత్రించారు. ఈవిధంగా కమ్యూనిస్టులు, బ్రిటిషు పెత్తందార్లు, ఒకే స్వరంలో పాడుతున్నారు. ఎందుకీ రోకంటిపాట?

కాని ఈనాడు కాంగ్రెసు - కమ్యూనిస్టులు (పేజీ 18) అను తన వ్యాసంలో జోషీ ఏమంటున్నాడో చూద్దాం. "కాంగ్రెసు జపాను అనుకూలసంస్థ అంటూ బ్రిటిషు ప్రభుత్వం విదేశాలలో చేసిన దుష్ప్రచారాన్ని మేం ఎదుర్కొన్నాం" కమ్యూనిస్టులకు ఎన్ని నాలుకలున్నాయో గమనించండి.

కమ్యూనిస్టులే దేశభక్తులు!
మిగతావారో?
పంచమాంగదళం!

(రాజకీయతీర్మానం ప్రజాశక్తి ప్రచురణ పేజీ 6, 7 లో యిలాయున్నది.)

ఇంకా, ఎలా కాంగ్రెసును బుద్ధిపూర్వకంగా, వీరు దూషిస్తున్నారో గమనిద్దాం,

1943 మే ఆఖరువారంలో జరిగిన అఖిలభారత కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసులో ఆమోదించబడిన రాజకీయతీర్మానంలో "మనజాతీయపార్టీ లవలంభించిన పంథావల్ల, నిరంకుశాధికారులు నిప్పుతొక్కిన కోతివలె చిందులు తొక్కారు. దేశ

రక్షణకు ప్రజలందరిని ఐక్యపరచడమే నాటి పరిస్థితులలో నిజ మయిన దేశభక్తి. అట్టి కర్తవ్యాన్ని మనజాతీయ పార్టీలు నిరాకరించాయి ఫలితం, మన దేశాన్ని నిరంకుశాధికారులకు ప్రమాదంలో వుంచడానికి అవకాశం దొరికింది. మన దేశ ములో పెద్ద జాతీయపార్టీలయిన కాంగ్రెసు, ముస్లింలీగు దేశ రక్షణయే ప్రధాన కర్తవ్యం అనే విషయాన్ని గుర్తించలేదు అందుకై జాతీయైక్యతను నిర్మించడానికి చొరవ తీసుకోలేదు సామ్రాజ్యవాదులే అధికారాన్ని ప్రసాదించుతారని నిరీక్షిస్తూ కూర్చున్నారు. జాతీయైక్యతయొక్క శక్తిపై తమ పంథాను అధారపరచలేదు. ఈ రోజున అతి విశాలమయిన జాతీయైక్య తను సాధించడం కష్టసాధ్యమైన పనికాదు. ఎందువల్లనంటే, దేశంలోవున్న ప్రతి వర్గాన్ని, ప్రతి మతాను, సమానంగా ప్రమాదం ఎదుర్కొంటూంది. లీగ్, కాంగ్రెసులు తమ పాల సీని మనప్రజల దేశభక్తిపై ఆధారపరచక పోవడం పెద్ద పొర బాటు. మనమాతృదేశాన్ని కాపాడుకునే నిమిత్తం ప్రజలం దరిలోను దేశభక్తియుతమయిన ఉత్సాహాన్ని కలిగించడానికి బదులు సామ్రాజ్యవాదులు యిండియాను వలసదేశంగా ఉంచు కోవాలనే దురాశపై లీగ్, కాంగ్రెసులు ఆధారపడ్డాయి. దేశ రక్షణను స్తంభింపచేస్తే, సామ్రాజ్యవాదులు జపాను దురా క్రమణనుండి ఇండియాను వలసదేశంగానే రక్షించుకునే నిమి త్తం ఎప్పటికైనా దిగివచ్చి, రాజీ చేసుకోపోతారా? అనే భావం లీగ్, కాంగ్రెసులు కలిగియుండేవి. చరిత్రలో యింత

కంటె తప్పుడు అంచనా ఉండబోదు. ఆచరణలో పాలసీ రెండింటికి హానితీసింది.

(1) సామ్రాజ్యవాదులు దేశాన్ని పక్కవాటుగా దెబ్బకొట్టడానికి అవకాశం దొరికింది.

(2) విదేశీ దురాక్రమణదారు దేశంమీద దుడుకి దండయాత్ర సాగించడానికి అనుకూల పరిస్థితి ఏర్పడింది.

పై వాక్యాలు జాగ్రత్తగా పరిశీలిస్తే ఏమని తేలుతోంది? కమ్యూనిస్టులంటున్నట్లుగా, "దేశరక్షణకై ప్రజలందరిని ఐక్యపరచడమే నాటి పరిస్థితులలో నిజమైన దేశభక్తి"గా కాంగ్రెసు భావించలేదు. ఆగస్టు తీర్మానము అర్థంచేసుకోడానికి యత్నిస్తే, ఇలాంటి తప్పుడు ప్రచారం చేయడం సాధ్యం కాదు. లేక బుద్ధిపూర్వకంగానే ఇలాంటి దుష్ప్రచారాన్ని చేస్తూ ఉండాలి. ఎందువల్లనంటే, ఆగస్టు తీర్మానంయొక్క సారాంశం ఏమంటే, దేశరక్షణకై ప్రజలందరినీ సమీకరించగల జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించవలసిన ఆవశ్యకత నొక్కి చెప్పుటయే. అందుకొరకై నిర్ణీతమైన కార్యక్రమంకూడ వున్నది.

కాని, కమ్యూనిస్టులు "సామ్రాజ్యవాదులే అధికారాన్ని ప్రసాదించుతారని నిరీక్షిస్తూ కూర్చున్నారు." జాతీయ శక్తుల ధారుధ్యంపై తమ పంథాను ఆధారపరచలేదు. సామ్రాజ్యవాదుల దయా, దాక్షిణ్యాలపై తమ పంథాను ఆధారపరచినారు. ఈ పద్ధతినే "దేశరక్షణకై ప్రజలందరినీ ఐక్య

వరచే నిజమైన దేశభక్తి"తో కూడిన దని మురిసిపోతున్నారు. తామే కొన్ని నిర్వచనాలు చేసుకుని, అలాంటిదే దేశభక్తిగా భావించి కులుక్కుంటే ఎవరికేమీ అభ్యంతరము ఉండకూడదు. అంతమాత్రం, భావస్వాతంత్ర్యం లేకపోతే ఎలా చెప్పండి? గాని ఇలాంటి ఆత్మస్తుతి"తో పాటు పరనింద కూడ అగ్నికి వాయువుతోడైనట్లుగా వున్నది. "లీగ్, కాంగ్రెసులు తమ పాలసీని మన ప్రజల దేశభక్తిపై ఆధార పరచకపోవడం పెద్ద పొరపాటు." ఆచరణలో యీ పాలసీ రెండింటికి దారితీసింది. (1) సామ్రాజ్యవాదులు దేశాన్ని వక్కలాటుగా దెబ్బకొట్ట డానికి అవకాశం దొరికింది. (2) విదేశీ దురాక్రమణదారు దేశంమీద దుమికి దండయాత్ర సాగించడానికి అనుకూల పరిస్థితి ఏర్పడింది" తమదే దేశభక్తి! మిగతావారిది బ్రిటిషువ్యతిరేకత! విదేశీదురాక్రమణ దారునకు అనుకూలత! అంటే పంచమాంగదళ కార్యక్రమము! కాని, ఇలాంటి కాంగ్రెసులోనే తాము కూడ ఉండటానికి పట్టుబట్టారు.

**వద్దు-బాబూ కాంగ్రెసులో వద్దు**

హక్కు వున్నదంటారు. వద్దు. బాబూ వద్దు "చూస్తూనే బురదలో దిగుతామనకండి." మీలాంటి దేశభక్తులు 'ప్రజల దేశభక్తిపై తమపాలసీనే ఆధారపరచిన' కాంగ్రెసులో చేరడం తప్పుకదూ! ఎవరయినా వింటే నవ్విపోతారు ఆరు నెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారన్నారు' అలాగే

మీరు కాంగ్రెసులో చేరి కొన్నాళ్ళు వుంటే చరిత్రలో ఎన్నడూ ఉండబోని తప్పుడు అంచనాలను వేస్తారేమొ! ఎందుకొచ్చింది? 'దుష్టుడికి దూరంగా ఉండమన్నారు' కాంగ్రెసుకు దూరంగానే వుండండి. ఇవిస్నేహభావంతో అంటున్నమాటలే సుమా? వేరుగా భావించకండి. మీక్షేమంకోరే ఇలా చెప్పాల్సినివచ్చింది. 'కష్టాల్లోనూ, చిక్కుల్లోనూ, ఉన్నవాళ్ళంటే, ఎవరికయినాజాలి కలుగకమానదు. కాని, తమజాతియావత్తూ తీవ్ర నిర్బంధ విధానానికి గురి అవుతున్న రోజుల్లో, తుపాకుల టపటపలు, ఫిరంగుల ఫెళఫెళలు, టాంకుల ధణాధణలు, విమానాల ఝుంకారం' చెవుల్లోగింగురుమంటున్న రోజుల్లో 'కొండలగుండియలతో' (పామండులు) ఒకరకపుమనుష్యులు శత్రుశిబిరంలో తల దాచుకున్నారు. వారెవరో నేను చెప్పను. ఎందువల్ల ఈసంగతి ఉదహరించానంటే, తమ జాతికష్టాల్లోను, చిక్కుల్లోను వున్నారని జాలికలుగని 'కొండలగుండియ' లున్నారని చెప్పడానికే.

(మహిళా ఉద్యమ నిర్మాణ సమస్యలు స్త్రీ శక్తి ప్రచురణ 1943 పేజీ 71)

కాంగ్రెసువంధా శాసిస్టుదాస్యానికి దారి తీస్తుంది

విడుదలయివచ్చిన కాంగ్రెసు సోదరుల్ని నేనొకప్రశ్న అడుగుతాను. మీరే కనుక బయటఉంటే ఏమిచేసియుండేవారు? మే మవలంభించిన విధానాన్నే మీరూ అవలంభించి యుండేవారని మీరు తప్పక

జవాబు చెబుతాను!" (కమ్యూనిస్టులు - కాంగ్రెసు పేజీ 18) అని గారడీ చేయడానికి చూస్తున్నాడు జోషి - 1944 సం॥ ఆఖరులో, కాంగ్రెసువాదులు చాలమంది జైళ్ళనుండి విడుద లవుతున్న తరుణంలో, తమూర్పణ ధోరణిలో, ఓదార్పుకోవ మని, ఉద్దేశించి కపటస్నేహాన్ని ఆశయంగా పెట్టుకుని, అన్న మాట లివి.

కాని 1943 సం॥లో ఆంధ్రకమ్యూనిస్టులు కాంగ్రెసు వాదులపై ఎలాంటి ప్రచారాన్ని చేసారో గమనించండి. కాం గ్రెసువాదులంతా జైళ్ళలోవున్న తరుణంలో "ఇప్పుడు ఫాసిస్టు లు ప్రపంచాన్ని దుర్భరదాస్యంలో ముంచజూస్తున్న యీసమ యంలో గూడ దేశానికి కాంగ్రెసునాయకత్వం తప్పుడు దారి జూపి, దేశాన్ని అరాజకంలోకి దింపడానికి ప్రభుత్వానికి అవ కాశ మిచ్చింది. ప్రస్తుతం కాంగ్రెసువాదులు అవలంబించు చున్న పంథా ఫేసిస్టుదాస్యానికి దారితీస్తుంది"

పైమాటలు ఇండియా కార్యదర్శి ఆమెరీ అంటున్నవి గావు. కమ్యూనిస్టులు తాము స్థాపించుకొన్న పార్టీ కీలుబొమ్మ 'మహిళాసంఘాల నిర్మాణమునకు' "కాంగ్రెసువాదులు అవ లంభించుచున్న పంథా ఫేసిస్టు దాస్యానికి దారితీస్తుంది. అని కాంగ్రెసు వ్యతిరేక పునాదిని వేయడానికి ఎకాఎకిని పూను కున్నారు. "కాంగ్రెసు ప్రకటిస్తూ వచ్చిన ఫాసిస్టు వ్యతిరేక తీర్మానాలను విరివిగా ప్రచారం చేశాం" అంటాడు పి. సి. జోషీ (కమ్యూనిస్టులు, కాంగ్రెసు పేజీ 18) కాంగ్రెసు ఫాసిస్టు

వ్యతిరేక తీర్మానాలను చేసినమాటనిజమే కాని, కమ్యూనిస్టులు, కాంగ్రెసు పంథా ఫాసిస్టువాస్యానికి దారితీస్తుందని ప్రచారం చేసారు. ఇదీ అసలు విషయం. మిస్టరు జోషీ! ఎందుకొచ్చిందీ ముసుగులో గుద్దులాట"

"బోసుపంథా కాంగ్రెసు పంథా ఒకటే!"

ఇంకా జోషీ ఏమంటున్నాడో విందాం "ఆగస్టు తీర్మానంలో కాంగ్రెసు మిత్రరాజ్యాల విజయాన్ని ఫాసిస్టుల పతనాన్ని కోరింది. స్వేచ్ఛా ప్రపంచం కొరకు జరిగే ఈ పోరాటంలో తన పాత్రను సరిగా నిర్వహించడానికి జాతీయ ప్రభుత్వం అవసరమని ప్రకటించింది. కాని జయప్రకాశనారాయణ దీనికి విరుద్ధంగా, హిట్లరుకు రష్యా లొంగిపోవాలని, టోజోకు చైనా దాసోహం చేయాలనీ, బోసు ఇండియాకు రావాలని, కోరుతున్నాడు" శ్రీజయప్రకాశ నారాయణ గారు ఆగస్టు తీర్మానానికి విరుద్ధంగా వున్నారో, అనుకూలంగా వున్నారో లోకానికి తెలుసు వున్నవి లేనివి, పిచ్చ గీతలుగీచి, పెడార్థాలు కల్పించడంలో కమ్యూనిస్టులు మొనగాళ్ళు. ఆగస్టు తీర్మానానికి పూర్తి వ్యతిరేకార్థాన్ని ఎలా కమ్యూనిస్టులే చెబుతున్నారో చూదాం. ప్రస్తుత రాజకీయాల్లో ఉండే 3 పంథాలు (1) కాంగ్రెసు నాయకత్వపుమార్గము (2) బోసుమార్గం (3) కమ్యూనిస్టులమార్గం. నిజానికి మొదటి రెండు ఒకే ఫలితానికి దారితీస్తాయి. బ్రిటిషు ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని ఇవ్వాలం

టుంది కాంగ్రెసు నాయకత్వం. జపాను స్వాతంత్ర్యిస్తుం దంటాడు బోసు. ఫలితం ఫాసిజం. ఇతరులమీద ఆధారపడక మన ప్రజలమీదనే ఆధారపడాలంటుంది కమ్యూనిస్టుపార్టీ”

మహిళా ఉద్యమం నిర్మాణసమస్యలు ప్రజాశక్తి ప్రచురణ 1943 పేజీ 4, 5 ల్లో)

“ఆగస్టు తీర్మానంలో కాంగ్రెసు మిత్రరాజ్యాల విజయాన్ని, ఫాసిస్టులపతనాన్ని, కోరింది” ఇది ముమ్మాటికీనిత్యం కాని, కాంగ్రెసు పంథా, బోసుపంథా, రెండూ ఫాసిజానికి దారి తీస్తాయని వాదించడమే, కాంగ్రెసంటే, కమ్యూనిస్టులకు వున్న అభిప్రాయాన్ని తెలియజేస్తున్నది. కమ్యూనిస్టులు ‘ఫాసిజానికి వ్యతిరేకులు’ కాంగ్రెసు పంథా ఫాసిజానికి దారితీస్తుంది! అందువల్లనే మేము అంటున్నాము కదా, కమ్యూనిస్టులు కాంగ్రెసు వ్యతిరేకులని.

వర్కింగుకమిటీ సభ్యులు

ఇలా మేమంటుంటే జోషి ఏమంటున్నాడో విందాం. “కాంగ్రెసులో మహాత్ములను లేకుండా చేయడం సాధ్యం కాదని మేము గట్టిగా నమ్ముతున్నాము. ఏ మతా కూడ మా స్వార్థ రాహిత్యంముందు నిలబడలేదు. మా దేశభక్తిముందు మొట్టి దుష్ప్రచారం, అపవాదులు పనిచేయజాలవు. వర్కింగు కమిటీ సభ్యులందరూ విడుదలవగానే, నేను వారి ముందు బోను ఎక్కి నిలబడతాను. ఆగస్టు ఉద్యమంత

ర్వాత మేమవలంభించిన పంథా, మేము చేసిన కృషినిగూర్చి తీర్పుచెప్పమని వారిని అడగడానికి వెనుదీయము"

"వర్కింగుకమిటీసభ్యులు నిష్కపటమైన మేధావంతులు రాజకీయంగా బాగా అనుభవం గలవారు; ప్రజాస్వామ్య సిద్ధాంతాలను అనుసరించేవారు" (కమ్యూనిస్టులు కాంగ్రెసు పి. సి. జోషీ పేజీ 82) వర్కింగు కమిటి సభ్యులంటే జోషీ కెంత విశ్వాసము! చూడండి! భారత కమ్యూనిస్టు పార్టీ ప్రథమ కాంగ్రెసు సమావేశంలో జోషీ రిపోర్టులో ఏమున్నదో! 'జాతీయనాయకత్వం కార్యాచరణ లేని (Negative) పాలసీ ద్వారా చొరవను సామ్రాజ్యవాదుల చేతుల్లోపెట్టి, జాతీయ విధ్వంసక పాత్రను ధరించినది. ఆగస్టు 9 తరువాత మన ప్రచారాన్ని కేవలం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగానే కేంద్రీకరించాం. దేశాన్ని పంచమాంగ దళంవారి హస్తాల్లోకివిసిరిన, దేశనాశనానికి దారితీసిన, కాంగ్రెసునాయకత్వంయొక్క పాలసీని ప్రజలముందు అవసరమైనంతగా మనం బహిరంగ పరచలేదు. ఇలా జరగడానికి కారణం తేట తెల్లంగానేవున్నది సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానంవల్ల మనంకూడ దెబ్బతిగొట్టబడ్డాం. గాంధిజీ నెహ్రూల పంథాలకన్న మన పంథాయేఎక్కువసామ్రాజ్య వాద వ్యతిరేక పంథాగా ప్రజలముందు చూపాలని ప్రయత్నించాం. దేశభక్తులు ఎక్కడ పొరపాటుబడ్డారో, పంచమాంగదళం చేతుల్లో వారెలా కీలుబొమ్మలవలె ఉపయోగపడుతున్నారో, మనశక్తినంతనూ కేంద్రీకరించి సచ్చ

చెప్పాల్సింది. దానికి బదులు మనమే అతివాద జాతీయవాద స్థాయికి దిగజారాం. అందువల్లనే పోరాటం విఫలమయినప్పుడు దేశరక్షణపంథా జాతీయపంథా అని దేశభక్తులు స్వీకరించు టకుమారు, నిస్పృహచెంది మూలకూర్చున్నారు.''

(జోషీ రిపోర్టు పేజి 39)

"వర్కింగు కమిటీ సభ్యులు నిష్కపటమయిన మేధా వంతులు" "నేను వారిముందు బోసు ఎక్కి నిలబడతాను" "తీర్పు చెప్పమని వారిని అడగడానికి వెనుదీయను" అంటున్న జోషీయే ఆ వర్కింగు కమిటీ సభ్యుల కార్యక్రమాన్నిగూర్చి "జాతీయనాయకత్వం — జాతీయ విధ్వంసక పాత్రను ధరించి వదని" తీర్పు చెప్పివేసాడు. "దేశాన్ని పంచమాంగదళంవారి హస్తాల్లోకి విసిరిన, దేశవినాశనానికి దారితీసిన కాంగ్రెసు నాయకత్వంయొక్క తీర్పు ఈనాడు జోషీకి కావలసివచ్చింది. అయ్యో! జోషీ, అలాంటికాంగ్రెసు నాయకత్వంయొక్క "పాలసీని వ్రిజలముందు అవునకమైనంతగా" బహిరంగపరచ లేదని చేసిన పొరపాటును దృష్టిలో వుంచుకునే "నేను వారి ముందుబోను ఎక్కి నిలబడతాను"అంటూ వారికి గొప్ప తనాన్ని అంటగట్టకం పార్టీపాలసీకి విరుద్ధమేమో కాస్త ఆలో చించావా? — అయినా పార్టీకి పాలసీ అంటూవుంటేగా! ఎప్పటికేది వాటంగావుంటే అదే పార్టీపాలసీ! లేకుంటే, ఏమిటీ అవకతవకలు? కాదు - కాదు. ఇదంతా 'జాతీయరంగంలో

శ్రామికవర్గపు ఎత్తుగడలు' 'బోల్షివిక్కుల రాజనీతిచతురతో కాబోలు. ఫాసిస్టులకు ఒకనిర్ణీతమయిన పాలసీ వుండదని అన్ని ఎత్తుగడ లేవని, ఏదిపార్టీని బలపరుస్తుందో అదే వారి కానాటి 'తిరుమంత్ర' మని "కామ్రేడ్సు" చెబుతూ వుంటారు. ఫాసిస్టులసంగతి ఏమోగాని, కమ్యూనిస్టులుమాత్రం ఇలానే చేస్తున్నారు. ఇది నిర్వివాదాంశం.

వర్కింగు కమిటీ సభ్యులంటే, హఠాత్తుగా, ఇంత సమ్మోకము వారికి ఏర్పడిందంటే, ఇందులో ఏదో 'విశేష' మున్నది. ఏమంటే, ఏట్లో మునిగిపోతున్న వాడికి, కనీసం, గడ్డిపోచ అయినా, పెద్దభూతంగానే కన్పిస్తుంది. జాతీయరంగంలో నుండి 'వెలి' వేయబడిన కమ్యూనిస్టులకూ, ఏదో ఒకసాకు, వంకతో ప్రస్తుత ప్రమాదాన్ని కనీసం, వాయిదా వేయించుకుంటే, కొంతవరకు ప్రాణాలు కుదుట పడతాయి. తర్వాత సంగతి తర్వాత అంచేత, ప్రస్తుతం వర్కింగుకమిటీ సభ్యులు జైల్లో వున్నారు. వారు విడుదల అయ్యే సూచనలుకూడ లేవు. ఈ లోపున కాంగ్రెసువాదులు తమని 'అంటరాని' వారిగ చూస్తున్నారు. కాంగ్రెసువాదులతో కలసి మెలసి వుంటేనేగాని, తమపార్టీ బలపడదు. అందుచే, 'ఇవ్వ డెందుకయ్యా' మాపై కారాలు, మిరియాలు నూరుతారు. రానివ్వండి, వర్కింగు కమిటీ సభ్యులను, ఆరోజున వారిముందు మేం బోనులో నిలబడతాం. వారిని తీర్పు చెప్పమని అడుగుతాం. అందాకా మీరు మేము కలసి పనిచేద్దాం!' ఇది రూసో - ఇండియనుల ధోరణి.

నేరస్థుని మానసికప్రవృత్తి

"బోనులో ఎక్కి నిలబడతాను! తీర్పు చెప్పమని అడుగుతాను" అని జోషీ అంటున్నమాటలు అతని మానసిక ప్రవృత్తిని చక్కగా చిత్రిస్తున్నాయి. ఏ నేరస్థుడు ఇంత కన్నా భిన్నమైన ధోరణిలో మాట్లాడలేదు.

భారత జాతీయోద్యమానికి తన పార్టీ గావించిన ద్రోహాన్ని తానే ద్యోతక పరచుకొంటున్నాడు. ఇలాంటి నేరానికి తగిన శిక్షను విధించాలంటే స్టాలిన్ సరిపోతాడు. కాని, భారత ప్రజలు తమ తీర్పును ఇచ్చివేశారు. స్టాలిన్ ధోరణిలో కాదు. గాంధీజీ ధోరణిలోనే తత్ఫలితమే, భారత జాతీయోద్యమం లోనుండి కమ్యూనిస్టులు 'వెలి' వేయబడుట. అంటే, భారత ప్రజలు 'సహాయనిరాకరణ' ఆయుధాన్ని ప్రయోగించినారు. అంచేతనే కమ్యూనిస్టులు ప్రజలసహాయ సానుభూతులను పూర్తిగా కోల్పోయారు. వర్కింగు కమిటీ సభ్యులు విడుదల అయినా, ఇదే తీర్పును ఖాయపరుస్తారు. కమ్యూనిస్టుల 'అప్పీలును' త్రోసి వేస్తారు. ఎందువల్లనంటే, భారత ప్రజలు నిర్ణయించిన దానికి వ్యతిరేకంగాపోయే అలవాటు వారికి లేదు. కనుక, జోషి వృథాప్రయాసకు లోనవుట ఎందులకు? ఇవన్నీ 'నక్కజిత్తులు' 'తాతకు దగ్గులు నేర్పడమే! ఎంతసాహసం! అందితే జుట్టు అందకపోతే కాళ్ళు' కాంగ్రెసు నాయకత్వంయొక్క పాలసీ దేశ వినాశనానికి దారితీసిందన్న నాలుకతోనే వారిముందుబోనులో

ఎక్కి నిలబడతా మంటున్నారు ఔరా! కాలమహిమ! ఇలాంటి వారుఉంటే ధర్మం నాలుగు పాదాలమీద నడవక ఏంచేస్తుంది?

**జోషీగారి బోల్షివిజం**

రూసో ఇండియనులో, ఇదమిద్ధంగా చెప్పడం కష్టమేగాని, భారతీయుల జాతీయ తను భిన్నమైన పద్ధతిలోవారు, మన దేశ దేశభక్తుల దారిని ఎలాపోతారు? చెప్పండి. జోషీ న్యాయంగా అన్నమాటలివి 'దేశభక్తులు మెప్పునుపొంద డానికి నిరంకుశోద్యోగులను తిట్టడమంటే, దేశభక్తులు పోయిన దారిని మనంగూడ పోవడ మన్నమాట.' మనం దేశభక్తులను ఆ మార్గంనుంచి కాపాడాలి. వట్టిమాటలతోనే నిరంకుశోద్యో గులను బట్టబయలు చేయాలను కోవడం, సత్యాగ్రహంగాని బోల్షివిజంగాదు" (జోషీరిపోర్టు పేజి 42) అంటే. సామ్రాజ్య వాదుల మెప్పును పొందడానికి దేశభక్తులను తిట్టడం, దేశ భక్తులు పోయినదారికి వ్యతిరేకంగా బోవడం. ఇదీ జోషిగారి బోల్షివిజం! ఇది సామ్రాజ్యవాదుల బడిలో నేర్చుకున్నట్లున్నది! దేశద్రోహమా! ఎంత చేసినావు!

**సోవియట్ యూనియన్—గాంధీజమా**

"1920 సత్యాగ్రహ ఉద్యమం విఫల మైన తరువాత, గాంధీజానికి ప్రత్యామ్నా యంగా, సత్యాగ్రహంకంటె ఎక్కువ ప్రభా వంగల పద్ధతి కావాలని దేశభక్తులు ఆలో చించ సాగారు. సహజంగా వారిదృష్టి సోవియట్ యూని యన్ వైపు మళ్ళింది"

(జోషీ రిపోర్టు పేజీ 2) ప్రజాశక్తి కార్యాలయం.

జోషీలాంటి 'దేశభక్తులకు' దృష్టి ఎప్పుడూ రష్యాపైననే ఉంటుందని, భారత దేశంపైని అలాంటి దృష్టి ఉండదని వారి రాజకీయాలే తెలియ చేస్తున్నాయి. అంచేతనే, వారిదిరష్యన్ దేశభక్తి అవుతుంది. ఇంకా వివరంగా చెప్పాలంటే భారత దేశంలోని రష్యన్ దేశభక్తులు! ఇండియాలోని 'జర్మన్ సిల్వర్' లాగు!

నెహ్రూను అనుసరించవద్దు చర్చిలును బలపఱచాలి

సామ్రాజ్యవాదులపై శక్తి కేంద్రీకరించడము పొరపాటనీ, అలాచేస్తే నెహ్రూనుబలపరచడమేనని జోషీ తన అనుచరుల్ని ఎలా హెచ్చరిస్తున్నాడో చూడండి. 'మనం ఎంత ఎక్కువగా సామ్రాజ్యవాద ఉద్యోగులమీదనే మన శక్తినంతటినీ కేంద్రీకరించామో, అంత ఎక్కువుగా నెహ్రూ వలె ప్రవర్తించామన్నమాట. అందువల్ల సామ్రాజ్యవాదుల నిర్బంధవిధానాన్ని తగ్గించలేక పోయాం. కాంగ్రెసు విధానం విఫలమయి నప్పుడు, కమ్యూనిస్టు విధానంకూడ విఫలమవుతుందనీ, నిరంకుశోద్యోగులను లొంగదీయ లేమని దేశభక్తులు భావించారు.''

[జోషీ రిపోర్టు ప్రజాశక్తి కార్యాలయం పేజీ 48]

ఇలా కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద ఉద్యోగులకు చిక్కులు గల్గించకుండా సహాయ పడినందులకు చర్చిలు ఎప్పుడయినా జోషీగారికి కృతజ్ఞతాభి వందనాలు తెలియచేశాడా

ఇలాంటి ఉపకారానికి చర్చిలు ఎలాంటి సహాయం చేసాడో జోషీకి!

పై వాక్యాలను పరిశీలిస్తే ఏమి తేలుతోంది?

1. నెహ్రూవలె ప్రవర్తించకూడదు. అలా చేస్తే సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానాన్ని తగ్గించలేము.

2. సామ్రాజ్యవాద ఉద్యోగులమీద శక్తి కేంద్రీకరించకూడదు.

3. కాంగ్రెసు విధానం విఫలమయ్యింది.

4. నిరంకుశోద్యోగులను లొంగదీయ లేమని దేశభక్తులు భావించారు.

(1) నెహ్రూవలె ప్రవర్తిస్తే సామ్రాజ్యవాదులనిర్బంధ విధానాన్ని తగ్గించలేమంటాడు జోషీ. అసలు సామ్రాజ్యవాదులు ఎందువల్ల నిర్బంధ విధానాన్ని ప్రవేశ పెట్టారు? ఆగస్టు తీర్మానంవల్లనే గదా!

ఆగస్టు తీర్మానం అంతటికీ వ్యతిరేకులు

అయితే కమ్యూనిస్టులు ఆగస్టు తీర్మానానికే పూర్తి వ్యతిరేకులు. కాని వారేమంటారంటే, 'పోరాటం సాగిస్తామనే బెదరింపుకు మాత్రమే మేము వ్యతిరేకులం అంటారు. కాని ఇది నిజంకాదు. ఆగస్టు తీర్మానం అంతటికీ కమ్యూనిస్టులు వ్యతిరేకులు ప్రతి వాక్యానికి, ప్రతిమాటకు, ప్రతి అక్షరానికి - అంతటికీ - వ్యతిరేకులే. ఆగస్టు తీర్మా

వంలో యుద్ధాన్ని గూర్చి వున్న మాటలకు వారు వ్యతి రేకులు. ముస్లింలను గూర్చి వున్న మాటలకు వారు వ్యతి రేకులు. ఆగస్టు తీర్మానంలో నేటి యుద్ధము మనకు ప్రజా యుద్ధమని నిర్వచించ లేదు. పైగా జాతీయ ప్రభుత్వమున్న చేనేగాని ఇది మన ప్రజలకు సంబంధించిన యుద్ధముకాదని వున్నది. సామ్రాజ్యవాదులకు పూర్తిగా వ్యతిరేకముగా నున్నది. ఫాసిస్టులకుకూడ పూర్తిగా వ్యతిరేకముగా నున్నది. కాని కమ్యూనిస్టు లది సామ్రాజ్యవాదులకు పూర్తి లొంగు బాటు. కాంగ్రెసుపంథా స్వాతంత్ర్యసాధనకు దారి చూపింది. కమ్యూనిస్టుపంథా సామ్రాజ్యవాదులకు దాసోహం చేయమంటున్నది. ఇలా పూర్తి వైరుధ్యాలతో వున్నాయి.

ఇలాంటప్పుడు కాంగ్రెసుపంథా ప్రభుత్వానికి కంటక ప్రాయ మయ్యింది. స్వాతంత్ర్యసాధకులంటే ఎప్పుడూ అంతేగా! ఇదే నెహ్రూపంథా - కాంగ్రెసుపాలసీ. అందుచే ప్రభుత్వము నిర్బంధవిధానాన్ని ప్రవేశపెట్టింది. కనుక జోషీ 'నిర్బంధ విధానాన్ని తగ్గించ లేకపోయాం' అంటున్నప్పుడు పొరపడు తున్నాడు. తాము ప్రభుత్వానికి దాసోహమని, కాంగ్రెసు పంథాను వ్యతిరేకించుటవల్ల, ప్రభుత్వముకూడ కమ్యూనిస్టులపై 'నిర్బంధవిధానాన్ని' పూర్తిగా మానుకున్నది. ఆగస్టు రోజుల్లో దేశభక్తులు జైళ్ళకుపోతుంటే, కమ్యూనిస్టులు జైళ్ళ నుండి విడుదల అయ్యారు. ఆరోజుల్లోనే, జాతీయపత్రికలను నిషేధిస్తే వారిపత్రికలు కొత్తవి వెలిశాయి. జాతీయసంస్థ నిషే

ధించబడితే వీరిసంస్థలకు పూర్తిస్వేచ్ఛ! అందుచే కమ్యూ్యనిస్టులు తమపై నిర్బంధ విధానాన్ని లేకుండా చేసుకున్నారు. ఇక దేశంలో నిర్బంధ విధానము వున్నదంటే, దేశభక్తులయిన ప్రజలకు వున్నది కాని, దేశద్రోహులకు ప్రభుత్వం చాలా సౌకర్యాలు చేసింది.

అంచేత జోషీ తన అనుచరుల్ని నెహ్రూవలె ప్రవర్తించకూడదని అంటున్నప్పుడు, దేశభక్తులవలె ప్రవర్తించకూడదని, అంటున్నాడు. అంటే నెహ్రూవలె ప్రవర్తించే దేశభక్తులకు ప్రస్తుత కమ్యూ్యనిస్టుపార్టీలో స్థానము లేదు. (౨) ఎందువల్లనంటే అలాచేస్తే నిర్బంధవిధానం తగ్గించలేరు! నిర్బంధవిధానం తగ్గించడానికి జోషి ఎంత గొప్ప ఉపాయం చెప్పాడో చూశారా! 'సూక్ష్మంలో మోక్షం' 'ప్రభుత్వ ఉద్యోగులపై శక్తి కేంద్రీకరించకూడదు' అంటే లొంగుబాటు కాక మరేమవుతుంది! 'దాసోహం మహాప్రభో' అనమంటూను.

(౩) పోతే, కాంగ్రెసు విధానం విఫలమయ్యిందంటాడు జోషీ. కాంగ్రెసు విధానమంటే, స్వాతంత్ర్య పోరాట విధానమనేనా! అంటే గాంధీజీ 'సత్యాగ్రహ' విధానమేగా? 'సత్యాగ్రహానికి ఓటమి లేదని మహాత్మాజీయే చెప్పియున్నారు.

(౪) నిరంకుశోద్యోగులను లొంగదీయలేమని దేశభక్తులు భావించారనడం, స్వాతంత్ర్యం సాధించలేమని దేశభక్తులు నిస్పృహచెందారని అసలు దేశభక్తినే శంకించడం!

ఇలా సామ్రాజ్యవాదంతో చెలిమిచేస్తున్న జోషీ గ్రూపు అనుకున్నారేమో కాని జాతీయవాదు లెవ్వరూ భావించరు.

సామ్రాజ్యోద్యోగులపై ప్రజలను రెచ్చగొట్టవద్దు కాంగ్రెసుపై ప్రజలను రెచ్చగొట్టాలి

"నిరంకుశోద్యోగులమీద ప్రజలను రెచ్చగొట్టాలిసిన అవసరం లేదు." దేశములో దాదాపు అన్నిచోట్ల నిరంకుశోద్యోగులను బట్టబయలు చేయడానికి ప్రాముఖ్యత ఇవ్వడం మన పంథాను జనరలుగా ప్రచారం చేయడంతో పాటు "మీమేదైనా దేశరక్షణ కార్యాలను చేయబోయే ముందు మా కోర్కెలు నెరవేర్చండి" అని నోటితో అనకపోయినా, ఆచరణలో ఆ వైఖరినే ప్రదర్శిస్తున్నాము" ఇలా సామ్రాజ్య ఉద్యోగులపై ప్రజలను రెచ్చగొట్టకూడదంటూనే. జోషీ కాంగ్రెసుపై ప్రజలను రెచ్చగొట్టే దానికి ఏమంటున్నారో చూడండి.

"అతి తక్కువ కాలంలో అతిత్వరితమైన" పోరాటం సాగించి బ్రిటిషు సామ్రాజ్య వాదులను లొంగదీస్తామని ఆగస్టు 9 న చెప్పినవారే, పదిమాసాల తర్వాత "ఇక చేయగలిగింది ఏమీ లేదు" అనే నిస్పృహావాక్యం పలుకుతున్నారు."

ఆ విధంగా జైలులోను, బయటను ఉన్న దేశభక్తులు నిస్పృహ చెంది కూర్చున్నారు. వారు పంచమాంగ దళంతో సంబంధాలు తెంపుకున్నారు. అందుకు మనం సహాయం చేశాం.

కాని నిర్మాణ లోపాలవల్ల ఓడిపోయామనే వైఖరిని వారు వదలుకోనంత కాలం, ఆహారసంక్షోభం, జపాను దాడి మొదలయిన పరిస్థితుల్లో వారు తిరిగి పంచమాంగదళం హస్తాల్లోకి పోవడానికి అవకాశమున్నది. "ఇక ఏమి చేయలేం" అనే వారి యీ వైఖరి ఆహారం, ఉత్పత్తి, గాంధీజీ విడుదల మొదలైన సమస్యల యెడల చేతులు ముడుచుకుని కూర్చునే వైఖరికి దారితీసింది. వారు సామ్రాజ్య వాదులను దూషించడంతో తమ అంతరాత్మను తృప్తిపరచు కొంటారు. ఆగస్టు 9 కి నేటికి మధ్యవచ్చిన మార్పేమంటే, తప్పతోవన బోవుచున్న దేశ భక్తుడు నిస్పృహా చెందిన దేశభక్తుడుగా మారుటే"

(జోషీ రిపోర్టు 33-34 పేజీలలో)

అసలు పోరాటమే లేదంటున్న కమ్యూనిస్టుల, మాట లివి. దేశభక్తులకు పంచమాంగదళంతో వున్న సంబంధాల్ని వీరు తెంపుటకు సహాయపడ్డారట! ఈ ఘనకార్యాల్ని సాధించినందుకు గర్వపడుతూ జపానుదాడి మొదలయిన పరిస్థితుల్లో వారు తిరిగి పంచమాంగదళం హస్తాల్లోకి పోవడానికి అవకాశమున్నది అంటూ దేశభక్తులపైకి ఇటు ప్రజలను, అటు సామ్రాజ్య వాదులను కూడ రెచ్చగొట్టుటకు ప్రయత్నించారు కాని విఫలులయ్యారు. తమపైకే ప్రజలను రెచ్చగొట్టుకున్నారు.

కాంగ్రెసు దేశభక్తులకు ఇదివరకు పంచమాంగదళం తో సంబంధమున్నదని, ఇప్పుడు సంబంధాల్ని తెంపుకున్నా

రని అంటున్నారు. అంటే కాంగ్రెసు దేశభక్తులు పంచమాంగ దళంతో కలసి పని చేసారని వీరి అభిప్రాయం. పంచమాంగ దళమంటే జపాను ఏజెంట్లనీ, శత్రువుల ఏజెంట్లనీ, అంటే కాంగ్రెసు దేశభక్తులు జపాను ఏజెంట్లతో కలసి పోయారనీ వీరు నిందిస్తున్నారు. ఇంతకన్నా నీచాతి నీచంగా ఎవరు దేశభక్తులను దూషించ గలుగుతారు. ఇంతకన్నా "పచ్చి అబద్ధాలు" ఏమైనా వుంటాయా: మన జాతీయోద్యమాన్ని పంచమాంగ దళోద్యమంగా వీరు చిత్రిస్తున్నారంటే, ఎలా వీరు దేశానికే శత్రువులో గమనించండి.

కాంగ్రెసు దేశభక్తులు ఎవ్వరూ ఎన్నడూ పంచమాంగదళంతో ఎట్టిపొత్తూ కలిగియుండలేదు. అసలు పంచమాంగదళమున్నదనీ ఫలానచోట వున్నదనీ, ఫలానవారనీ, దేశభక్తులకు ఎవరికీ తెలియదు. అలాంటప్పుడు ఇక వారితో కలిసి ఉండటం ఎలా సంభవిస్తుంది?

కాంగ్రెసు దేశభక్తులు దేశభక్తులతోనే, చెలిమి చేశారు కాని సామ్రాజ్య వాదులతో చెలిమిచేసిన కమ్యూనిస్టులు, సామ్రాజ్యవాదుల దృష్టినే అలవరచుకుని, దేశభక్తులను 'జపాను ఏజెంట్లుగా' ప్రచారం చేస్తున్నారు. 'కామ్రేడ్సు! బ్రిటిషుసామ్రాజ్యవాదుల కళ్ళజోడుతో చూస్తున్నారుసుమా దేశద్రోహమనే పొగమంచు మీదృష్టిని అటంకపరుస్తుందిసుమా!

ఔరా! అసలు కాంగ్రెసు పోరాటం ప్రారంభించలేదని కొన్నిచోట్ల, రాజేంద్రబాబు, పటేల్, గాంధీజీ సూచిం

చిన స్వరూపంతోనే దేశంలో ఉద్యమం నడిచిందని కొన్ని చోట్ల, వాటం వారీగా ప్రచారం చేస్తూ "కాని, నిర్మాణ లోపాలవల్ల ఓడిపోయామనే వైఖరిని వారు వదలుకోనంత కాలం, ఆహార సంక్షోభం, జపానుదాడి మొదలయిన పరిస్థితుల్లో వారు తిరిగి పంచమాంగదళం హస్తాల్లోకి పోవడానికి అవకాశముంది" అంటున్నాడు జోషి. అసలు పోరాటమే ప్రారంభించ నపుడు ఓడిపోవడమనేది ఎక్కడున్న దండి జోషీ మహాశయా! దయచేసి దీనికి సమాధానం చెబుతారా? నిర్మాణ లోపాలు' సవరించుకోడం తప్పా? నిర్మాణ రీత్యా బలాన్ని సంపాదించుకోడం కొరకు ప్రయత్నాలు చేసేవారంటే పంచమాంగదళ హస్తాల్లోకి పోయేవారని నిర్వచనం చేస్తున్నావంటే నీ దృష్టిలో స్వాతంత్ర్య సాధనకు పూనికతో పని చేసేవారంతా 'పంచమాంగదళమే నన్నమాట. ఇవన్నీ కొత్తరకపు దేశభక్తుల కొత్త నిర్వచనాలు! ఈ కొత్తరకపు దేశభక్తులకు స్వాతంత్ర్య సాధనా ప్రయత్నమల్లా, పంచమాంగదళ చర్యలే ఇదేంమాట! గోముఖ వ్యాఘ్రాలు! కాస్త యోచించండి!

**పంచమాంగదళం అంటే ఎవరు?**

1936—39 లో స్పెయిన్ అంతర్యుద్ధం గుర్తుకు తెచ్చుకోండి. ఆ సమయంలో మాడ్రిడ్ నగరాన్ని ఫాసిస్టు తిరుగు బాటు దారుల సైన్యాలు నలువైపులా ముట్టడించాయి మాడ్రిడ్ నగరం అతి ప్రమాదంలో వుంది. ఈ తరుణంలో

ప్రజాప్రభుత్వానికి వ్యతిరేకంగా, పలు వైపుల నుండి వస్తున్న ఫాసిస్టు సైన్యాలకుమాడ్రిడ్‌లోనుండే సహాయం చేసే ద్రోహులు జయులు దేరారు. అంచేత, ఈద్రోహులగుంపును పంచమాంగ దళం అన్నారు. అప్పటినుండి, ఆయా దేశాల్లోని ప్రజాశత్రువులకు తోడ్పడేవారిని, ఆయా దేశాల్లోని స్వాతంత్ర్య ఉద్యమాలకు వ్యతిరేకంగా ఫాసిస్టులకు, సామ్రాజ్యవాదులకు సహాయపడే వారిని పంచమాంగదళం అనడం పరిపాటి అయి పోయింది సామ్రాజ్యవాదులు, ఫాసిస్టులు ప్రపంచమంతటా తమ ఏజెంట్లను ఏర్పరచుకుని, ప్రపంచాన్ని తమతమ బాని సత్వాలలో ఉంచుకోడానికి విపరీతమైన ప్రయత్నాలు చేస్తున్నారు—అలాగే రష్యాలో పంచమాంగదళం వున్నదంటే అర్థం — జర్మనీకి సహాయపడేవారున్నారని, చైనాలో పంచ మాంగదళం అంటే జపానుకు సహాయపడేవారు, మన దేశములో పంచమాంగదళం అంటే బ్రిటిషుసామ్రాజ్యవాదు లకు సహాయపడేవారు. అయితే, ఈసందర్భంలో గుర్తుంచు కోవాలసింది ఏమంటే, ఆయా దేశాల ప్రజలను బానిసత్వంలో వుంచ ప్రయత్నించేవారికిగాని, సహాయపడితే వారిని పంచ మాంగదళం అనవచ్చు. ఈసందర్భంలో ఒక ప్రశ్న రావచ్చును ఏమంటే, భారత దేశంపై జపానుదాడిచేసి, బ్రిటిషు బాని సత్వంనుండి, తన బానిసత్వంలోకి మన దేశాన్ని ఈడ్వడానికి ప్రయత్నిస్తున్నదికదా, అలాంటప్పుడు దేశంలో జపానుకు సహాయపడేవారుంటే, వారిని ఏమనాలి? బ్రిటిషు సామ్రా

జ్యవాదులు కానివ్వండి. జపాను మిలిటరిస్టు కానివ్వండి. ఎవరయినాసరే మనదేశంపై తమ యాజమాన్యాన్ని నిలబెట్టుకోవడంకొరకు కానివ్వండి, లేక సంపాదించుకొనుట కొరకు కానివ్వండి. సహాయపడినవారంతా, ప్రజాశత్రువులతో చేతులు కలిపినవారే అవుతారు, అలాంటివారి నందర్నీ పంచమాంగదళం అని అనవచ్చు. మనదేశంలో జపాను ఏజంట్లు లేరని చాలామంది ప్రముఖులు చెప్పియున్నారు. మన జాతీయోద్యమంలో అట్టివారు ఎవ్వరూ లేరు కాని, కమ్యూనిస్టులు కొంతమందిపేర్లను ఉదహరిస్తూ, వారు జపాను ఏజెంట్ల కార్యక్రమముతో పనిచేస్తున్నారని తమపత్రికలో వ్రాసియున్నారు. భారతకమ్యూనిస్టులపార్టీ పత్రిక "పీపుల్సువార్"లో శ్రీజయప్రకాశ నారాయణ, రాం మనోహర లోహియా, అచ్యుత పట్వర్ధనుల పేర్లు ఉదహరించబడ్డాయి. ఆంధ్రకమ్యూనిస్టుపార్టీ పత్రిక "ప్రజాశక్తి"లో భూపతి కోటేశ్వర్రావు, మైనేని రామకోటయ్య, చిప్పుకుల వెంకటేశ్వర్లు మొదలగు పేర్లు ఉదహరించబడ్డాయి. అంతేగాక, కాంగ్రెసు సోషలిస్టుల ఫార్వర్డుబ్లాకు, ట్రాట్‌స్కీ-స్టులూ, రంగాముఠాలు పంచమాంగదళంగా ఉదహరించారు. ఈవిధంగా వ్యక్తులపేర్లను, ఉదహరిస్తూ, పంచమాంగదళం అంటూ వ్రాయడం, ప్రభుత్వాన్ని వారిపై రెచ్చగొట్టి వారిని అరెస్టు చేయించడానికి యత్నము. ఇలా పార్టీ ప్రచారానికి అడ్డువస్తున్నవారి పేర్లను పంచమాంగదళం అంటూ ప్రచారంచేసి వారిని జైళ్ళకు పంపితే, తమ ప్రచా

రము నిరాఘాటంగా సాగించుకోవచ్చునని, అరెస్టు లేకాదు, పంచమాంగదళం అని ప్రభుత్వము నమ్మితే ఉరిశిక్షలుకూడ వేయవచ్చును. ఇలా ఉరిశిక్షలు వేసినా, కమ్యూనిస్టులకు దిగులు లేదు. పైగా ఇంకా సంతోషమే. అలా ఉరిశిక్షలను వేయమని ప్రభుత్వాన్ని ప్రోత్సాహపరచడమే వీరి ఉద్దేశ మేమోననికూడ అనుమానించవలసివస్తున్నది.

**గాంధీజమా? లేక బోల్షివిజమా?**

ఇండియన్ కమ్యూనిస్టులు ఈ నాడు గాంధీగారికి మాకు ఏమి భేదము లేదని కొన్నిచోట్ల ప్రచారం చేస్తున్నారు. కాని వారు పూర్తిగా గాంధీ జానికి వ్యతిరేకులు-జోషీ ఏమంటున్నాడో చూడండి.

(భారతకమ్యూనిస్టుపార్టి సెంట్రల్ కమిటి సమావేశం జోషి రిపోర్టు పేజి 35

"రాజకీయంగా మన బలహీనత, గాంధీజం యొక్క బలం మన సభ్యుల మన స్తత్వాలపై కూడ ఆవరించియున్నదని రుజువుతోంది. గాంధీజమా లేక బోల్షివిజమా అనే సమస్య ఆగస్టు 9 వ తేదీన నగ్నస్వరూపంలో ప్రత్యక్షమయింది. మన బోల్షివిజంలో బలహీనత పూర్తిగా బయటపడింది" మిత్రమా జోషీ! ఆగస్టు 9 న నగ్నస్వరూపంలోప్రత్యక్షమయ్యినసమస్య స్వాతంత్ర్యమా బానిసత్వమా! దేశభక్తా! లేక దేశద్రోహమా? సామ్రాజ్యవాదమా? జాతీయోద్యమమా? అంతే కాని బోల్షివిజమా లేక గాంధిజమా? అసలుకాదు. దేశద్రోహం

లోని బలహీనత బయటపడుటయే బోల్షివిజంలోని బలహీనత బయట పడటమని మీరు భావిస్తున్నారా? మీ పుణ్యమా అంటూ బోల్షివిజం! లెనిన్ ఇలాంటి మాటలు వదిలెయ్యండి వేదాలు చదివే సైతాన్‌ల్లా ప్రవర్తించకండి.

**బూర్జువావర్గం ఆడుతున్న రాజకీయ జూదం**

(భారతకమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీ సమావేశంలో జోషీరిపోర్టు ది 16-9 42) లో ఏమున్నదో చూదాం పేజీ 36.)

"గత కొన్నిసంవత్సరాలుగా బూర్జువావర్గం అనుసరించుతున్న పాలసీయొక్క పర్యవసానమే ఆగస్టు 9 ఘటనల అంతరార్థం, అని గ్రహించలేదు. బూర్జువావర్గం ఆడుతున్న రాజకీయజూదమే యీపోరాట రూపం దాల్చిందనీ దానిఫలితం జాతీయ విధ్వంసమని కామ్రేడ్సు అవగాహన చేసుకోలేదు. అందుచేతనే చాలామంది కామ్రేడ్సు తరుచుగా నైహూగావించుతున్న వాదనలనే గావించసాగారు."

"బూర్జువావర్గం" అంటే జాతీయనాయకత్వం "ఆడుతున్న రాజకీయజూదమే ఈపోరాటరూపం దాల్చిందనీ దాని ఫలితం విధ్వంసమనీ" పి. సి. జోషి అంటున్నాడు. ఈప్రబుద్ధుడే "రాజకీయజూదముఆడుతున్న" వర్కింగు కమిటీసభ్యులు నిష్కపటమైన మేధావంతులు అంటున్నాడు. బూర్జువావర్గానికి" చెందిన వర్కింగు కమిటీ సభ్యులు నిష్కపటులు ఎలా అవుతారయ్యా జోషీచుకాళయా! "జాతీయ విధ్వంసం సాగిం

చేవారు" "ప్రజాస్వామిక సూత్రాలకు" కట్టుబడుతారనికూడ జోషీ అంటున్నాడు. ఎమిా పరస్పర వైరుధ్యం!

జాతీయనాయకత్వం రాజకీయ జూదంగా పోరాటం ప్రారంభించింది

సెంట్రల్ కమిటీ సమావేశం జోషీ రిపోర్టులో పేజీ 43 లో ఇలావున్నది. "ప్రజా ఐక్యతను నిర్మించ నిరాకరించిన బూర్జువా వర్గం కొన్ని పరిస్థితులలో జాతీయ విచ్ఛిన్నానికి సిద్ధపడుతుందనీ, రాజకీయ జూదంగా పోరాటాన్ని ప్రారంభించుతుందనీ తెలిసికోలేక పోయాం" వేరే వ్యాఖ్య అనవసరం వున్నదేమొ స్పష్టంగానే కన్పిస్తున్నది.

ఇలా ఎన్నిఅయినా ఉదాహరణలు యిస్తూపోతూఉండవచ్చును. కాంగ్రెసుసంస్థ జాతీయనాయకత్వం. ఆగస్టు తీర్మానములనుగూర్చి కమ్యూనిస్టులు చేస్తున్న ప్రచారంలోని అవకతవకలను బయటపెట్టి ఎలావారు కుత్రిమంగా కాంగ్రెసువాదులదరిచేర యత్నిస్తున్నారో వివరించాము. ఇంకా ఎన్నిఅయినా ఉదాహరణలు ఇవ్వవచ్చునుగాని, కాగితం కరువురోజుల్లో కాంగ్రెసు నాయకత్వాన్ని, స్వాతంత్ర్య ఉద్యమాన్ని నోటికొచ్చినట్లు ఆడిపోసుకున్న వారి వ్రాతలు ఇంకా వ్రాయడము కష్టమైపోతోంది.

౮

# మత సంస్థలు

హిందూ మహాసభ, ముస్లింలీగు, క్రిస్టియన్ ఫెడరేష న్‌లు మూడు ముఖ్యమయిన మతములకు ప్రాతినిధ్యం వహి స్తున్నామని చెవుతున్నాయి. మన యువకులకు ఒకేమతం. అదే స్వరాజ్యమతం. యువకులకేకాదు అసలు బానిస దేశాల లోని ప్రజలందరు జాతీయమతాన్ని స్వీకరించాలి. అంతేగాని, సంకుచితస్వార్థపరతత్వ కులతత్వవాదులను, మతతత్వవాదులను యువకులు బలపర్చరు. హిందూమహాసభ, ముస్లింలీగులు ఎలా మతపిచ్చిని రేకెత్తించి సాంఘిక విభేదాలను రెచ్చగొట్టుచున్నా యో తెలుసుకోవాలి. ఇలాంటి మతసంస్థలుమన దేశంలోనిసంస్థా నాధీశులకు, పెద్దపెద్ద భూస్వాములకు, పనిముట్లుగా వుపయోగ పడుతున్నాయి. హిందూమహాసభలో రాజాలు, మహారా జాలు, సర్‌లు, దివాన్ బహదూర్‌లు ప్రాబల్యాన్ని కలిగి వున్నారు. అలాగే ముస్లింలీగులో, నవాబులు, నవాబుజాదా జంగులు, ఖాన్‌బహదూరులు, ఖాన్‌సాహెబ్‌లు ప్రాబల్యాన్ని కలిగి వున్నారు. అందువల్లనే ఈ మతసంస్థలు జమీందారీ విధానానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. జమీందారీ విధానం, బ్రిటిష్ ప్రభుత్వపు సృష్టి, అందువల్లనే మన దేశమూను సంస్థా నాధీశులు బ్రిటిష్ ప్రభుత్వపు పంచమాంగదళంగా పనిచేస్తు

న్నారు. అందువల్లనే ముస్లింలీగు కాని, హిందూ మహాసభ కాని, ప్రభుత్వ వ్యతిరేక ప్రజాపుద్యమాలకు నాయకత్వం వహించవు. ఇవి కాంగ్రెసు కౌంటర్ యాక్టుచేయు దానికి సంస్థలే కనుక యువకులయిన మనము ఇలాంటి ప్రభుత్వ మద్దతు మత సంస్థలతో చేతులు కలువరాదు. అట్లు చేయుట మన బానిసత్వాన్ని, మన సంకెళ్ళచే బలపర్చు కొనుటయే కనుక సామ్రాజ్య వాదులు ఈ మతవిభేదాలను రెచ్చగొట్టె విధానం అవలంబిస్తూ, ఈమత సంస్థలకు ప్రాముఖ్యతనిస్తూ, తంతు సాగిస్తారు. పెద్దపెద్ద సంస్థానాధీశులు ఈ మతసంస్థలద్వారా ప్రజలలో తమ పలుకుబడిని ఎక్కువ చేసుకోడానికి యత్నిస్తారు. ఆమత సంస్థలను స్వాతంత్ర్య వుద్యమాలకు, జాతీయ చైతన్యాభివృద్ధికి ఆటంకంగా పరిగణిస్తూ జాతీయ మతాన్ని స్వీకరించి, స్వాతంత్ర్య సాధనకు పూనుకొని, సంకుచిత స్వార్థపర, కులతత్వములను, మతతత్వములను జాతీయ రంగంలో ధ్వంసం చేయాలి.

ముస్లింలీగు అభివృద్ధి నిరోధక రాజకీయాలు

గాంధి జిన్నా సంభాషణలు విఫలమవ్వడం విచారణీయాంశమే అయినా, ముస్లింలీగు రాజకీయాలను శాస్త్రీయంగా పరిశీలన చేసిన వారికి ఎంతమాత్రం కలిగించ లేదు. ఇటీవల జిన్నాగారి రాజకీయాలను పరీక్షిస్తే ఇలా కావడంలో అబ్బురమేమి లేదు.

భారత దేశంలో వున్న మహమ్మదీయ సంస్థ లన్నిటి లోకి ముస్లింలీగు ఎక్కువ పలుకుబడి గల సంస్థగా పైకి కన్పిం చుతోంది. కాని, వాస్తవానికి, ఇదంతా పై పై మెరుగేకాని లోపల సారం లేదు. అయితే ఇదంతా జిన్నాగారి ప్రయోజ కత్వమా? లేక లీగు ప్రయోజకత్వమా? బ్రిటిషు సామ్రాజ్య వాదుల యుద్ధఅవసరాలలో జిన్నాగారి పలుకుబడి ఒకటిగా కావలసి వచ్చింది. ముస్లింలీగుకు ప్రాబల్యంకూడ సామ్రాజ్య వాదులు కోరి తెచ్చి పెట్టిందే.

1934 సం॥ వరకు ముస్లింలీగుకు చెప్పుకోతగ్గ స్థానము మన దేశపు రాజకీయాలలో లేదు. దేశంలోని, జాతీయవాదు లచే ఏవగించుకోబడి మితవాదులచే ఎలాంటి సహాయాన్ని పొందలేక వేరే గత్యంతరం లేక జిన్నాసాహెబుగారు ఇంగ్లాం డుకు పోయి "ప్రాక్టీసు" చేసుకోడానికి ప్రయత్నాలు చేయవ లసి వచ్చింది. ఆ సందర్భంలోనే తాను ఇండియాకు తిరిగి రా నని భారత దేశ రాజకీయాల్లో పాల్గొననని జిన్నా ప్రకటించిన విషయం గుర్తుకు తెచ్చుకోండి.

అదే కాలంలో గొప్ప గొప్ప మహమ్మదీయ నాయ కులు వరుస వరుసగా, చనిపోయారు. అందుచే జిన్నాగారు తమ వైఖరిని మార్చుకున్నారు. ఇండియాకు తిరిగివచ్చి, ముస్లిం లీగును పునర్నిర్మాణము చేయప్రారంభించారు. అప్పుడుకూడ

జాతీయత, అభ్యుదయం, అంటూనే మాట్లాడేవాడు. ఇంకా బ్రిటీషువారి దయా, ధర్మాలపై ఆధారపడి, కొన్ని కొన్ని సంస్కరణలు రాబడదామనే ధోరణిలోనే వున్నాడు. అప్పటికే జాతీయ చైతన్యము సంపూర్ణస్వరాజ్యమను ఆశయమును ప్రకటించు నంతవరకు పోయెను.

జిన్నాగారి బలహీనత బయటపడి పోయింది. దేశంలోని ఇతర గ్రూపులతో చేతులు కలపాడు. 1936 - 37 లో జమియత్ ఉల్లేమావారు జిన్నాగార్కి ఎన్నికలలో సహాయం చేసారు. అందువల్లనే సంయుక్తరాష్ట్రాలలో జిన్నాస్థితి మరీ అధ్వాన్నంగా లేకపోవడానికి కారణం. బెంగాల్లోనూ, పంజాబ్ లోను జిన్నాగారి అభివృద్ధినిరోధకతత్త్వం బయటపడింది. బెంగాల్లో ధనాఢ్యవర్గంతోను, దోపిడీవర్గంతోను జిన్నా చేతులుకలిపి ఆర్థిక, సాంఘిక సమానత్వానికి పాటుపడేవారిని వ్యతిరేకించాడు. ఈరెండు రాష్ట్రాలలోను పూర్తిగా ఓడిపోయాడు. ఓటింగులో మహమ్మదీయులు పాల్గొన్న కాని ఫలితంగా 40/0 ముస్లింలు మాత్రమే జిన్నాకు, ముస్లింలీగుకు ఓటుచేసారు. ఇలా ముస్లిం ప్రజల అభిప్రాయం వ్యక్తపడింది. జిన్నాగారు, వారి ముస్లింలీగు మహమ్మదీయ ప్రజానామాన్యం అంతటికి ప్రాతినిధ్యం వహించుతా మంటున్నమాట ఎంతమాత్రము సత్యముకాదని ముస్లిం ప్రజలే రుజువుచేశారు. జనరలు ఎలెక్షనల్లో ఓడిపోయిన తర్వాత ఆరునెలలకు ఇదివరకెన్నడూ లేనంత 'గొప్ప' వాడయి పోయాడు. 1937 సం॥

అక్టోబరు నెలలో అప్పుడు బెంగాలు ప్రధానమంత్రిగావున్న ఫజుల్‌హాక్ పంజాబు ప్రధానమంత్రిగావున్న కె. శే. సర్. సికిందర్ హయాత్‌ఖాను, తలవనితలంపుగా జిన్నాగారినాయకత్వం తో సహకారం చేస్తామన్నారు. అలావారు మారిపోవడానికి చెప్పిన కారణాలు ఎవరికీ నచ్చలేదు. వారివారి రాష్ట్రాల్లో ఇద్దరూ బలంగానే వున్నారు. లీగులో చేరినందువల్ల వారికేమి లాభంలేదు. పైగా వీరు లీగులో చేరడంవల్ల లీగుకే బలం చేకూరింది. మిగతా రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు నిర్మాణం అయినందువల్ల ఇలా ఫజుల్‌హాక్, సికిందర్ మారిపోయా రనడానికి ఆధారములు ఏవీలేవు. జిన్నాగారు కాంగ్రెసు రాష్ట్రాల్లో దౌష్ట్యాలనుగూర్చి పేర్కొన్నమాట వాస్తవమే. కాని ముస్లింలీగువారు తప్ప మిగతావారంతా ఈవిషయాన్ని నమ్మలేదు. అందువల్ల యీకారణంచేత వీరిలో యీ మార్పువచ్చిందంటే నమ్మశక్యం కాదు. అందులోను సర్ సికిందర్ ఎల్లప్పుడు బ్రిటిషు ప్రభుత్వానికి విశ్వాసపాత్రుడుగా వుంటూ పంజాబ్‌లో వారికి కుడిభుజ్యంగా పనిచేసి బ్రిటిషు ప్రభుత్వంవారికి సమ్మతిలేని ఏపనినిగాని యీయన చేయలేదు.

అలాంటి సికిందరు ముస్లింలీగుతో చేతులుకలిపాడంటే బ్రిటిషు సామ్రాజ్యవాదులు జిన్నాగారి పట్ల దయార్ద్రహృదయులై ప్రవర్తించటం ప్రారంభించారన్నమాట. తెర వెనుక నాటకాలు స్పష్టముగా మనకు తెలియకపోవటికి ఆ యా పరిస్థితులనుబట్టి, వ్యక్తులనుబట్టి, సంస్థలకార్యక్రమాలను పట్టి

మోసము అంచనా వేసుకోవచ్చును. జనరల్ ఎలక్షన్సు (1936-37) లో కాంగ్రెసుకు చేకూరిన అఖండవిజయము బ్రిటీషు ప్రభువులకు భయ విభ్రాంతులు కలిగించెను. ఆనాటి అంతర్జాతీయ పరిస్థితులు కూడా విషమంగానే యున్నాయి. 1937 సం॥ నాటికల్ల మామూలు రాజకీయాలతో పరిచయం వున్న వారికైనా ఒక ప్రపంచ యుద్ధము చెలరేగియున్నదని గ్రహించుకొనుటకు వీలుగాయున్నది. అప్పుడే అంతర్జాతీయ రంగములో ప్రభుత్వాల కూటములు ప్రత్యక్షంగా ఏర్పడు చుండెను.

ఇలాంటి పరిస్థితులలో భారతప్రజల దృష్టిస్వాతంత్ర్యాశయము నుండి మళ్ళించి పెడమార్గాల పెట్టుట బ్రిటీషువారికి అవసరమయ్యెను. యుద్ధము బ్రద్దలవడంతోపాటు భారత ప్రజలు ఏకోన్ముఖులుగా స్వాతంత్ర్య వాంఛను సాధించుటకు పూనుకుంటే వారిని నిరోధించుట అసాధ్యమైన పనియని బ్రిటీషువారికి తెలుసును. అందువల్ల భారతజాతీయ శక్తులలో చీలికలు తీసుకురావడం ప్రభుత్వానికి అవసరమయ్యెను. స్వాతంత్ర్య సంఘటన విచ్ఛిన్నము చేయుటకు వారు పూనుకున్నారు. ఒక వైపున సావర్కారును రెచ్చగొట్టి హిందూమహాసభను కాంగ్రెసుకు వ్యతిరేకంగా బలపరచుటకు ప్రయత్నించిరి. మరొక వైపున జిన్నాను రెచ్చగొట్టి ముస్లింలీగును కాంగ్రెసును వ్యతిరేకంగా బలపరచుటకు ప్రయత్నించిరి.

పంజాబ్, బెంగాల్ ప్రధానమంత్రులు ముస్లింలీగుతో చేతులు కలుపుట ఇందుకు తార్కాణం. ఇంతకంటే స్పష్టమైన

నిదర్శనం ఏమంటే, భారత మహమ్మదీయు లందరికి ఏకైక నాయకుడుగా జిన్నాగారిని ఎట్టి సంకోచము లేకుండా ప్రభుత్వము గుర్తించుట. చరిత్రలో ఇదివర కెన్నడు బ్రిటిషువారు ఏ సంస్థ యొక్కనుగాని, నాయకునియొక్కగాని ముస్లింప్రజల ఏకైకనాయకత్వంగా వున్నామన్న వాదనను గుర్తించలేదు. ప్రపంచములో ప్రతిదేశంలోను ప్రభుత్వ ఆదరణపొందిన సంస్థలు నాయకులు మిడిమేలపు వలుకుబడి, ప్రాతినిధ్యాన్ని పొందుతారు. అందులోనూ బానిసభారతదేశంలో ప్రభుత్వ ఆదరణ అభిస్తే యింకా ఎక్కువ వుధృతంగా వారినడక సాగిపోతుంది. 1937—39 సం॥ రాలమధ్య ముస్లింలీగు పెనువు వేగంతో అత్యద్భుతమయిన పలుకుబడిని అధికారాన్ని సంపాదించి సభ్యత్వాన్ని పెంపొందించుకొన్నదంతా ఆశ్చర్యమొందు కుండాలి? యుద్ధము ప్రారంభమైనది. బ్రిటిషువారిఆట బాగానే కట్టిందని రుజువుఅయింది. పంజాబ్‌లో అహరర్‌లు పెద్ద యుద్యమాన్ని తీసుకవచ్చారు. ఈ వుద్యమం ప్రభుత్వాన్ని చీకాకు పరచింది. అహరార్ నాయకులు, వర్కర్లు పెక్కుమంది అరెస్టుచేయబడ్డారు. కాంగ్రెసు బ్రిటిషుయుద్ధ ఆశయాల విస్పష్టప్రకటనకై వేచియున్నది. సామ్రాజ్యవాద యుద్ధాన్ని ప్రతిఘటిస్తామని యిదివరకు కాంగ్రెసు తీర్మానించి నప్పటికీ తొందరపడి కాంగ్రెసుపోరాటాన్ని ప్రారంభించలేదు. కాని ప్రభుత్వయుద్ధప్రయత్నాలకు సహకారముకూడా చెయ్యలేదు. భారతప్రజలకు అధికారాన్ని హస్తగతంచేసి భారతదేశ

స్వాతంత్ర్యాన్ని గుర్తించమని కాంగ్రెసు కోరింది. ప్రభుత్వము మొండిచెయ్యి చూపెట్టి ముస్లింలీగును బలపర్చుటద్వారా సమాధానం చెప్పింది.

యుద్ధం ప్రారంభం అయినతరువాత భారత దేశములో ఎలాంటి నూతన రాజ్యాంగవిధానాన్ని అయినా తన గొంతెమ్మ కోర్కెలను సంతృప్తి పరచకపోతే వ్యతిరేకిస్తాననీ జిన్నాగారు ప్రకటించారు. జిన్నాగారిమాటలడాబుసరి బ్రిటిష వారికి బాగా తెలుసు. బ్రిటిషువారు ఈ జిన్నాధోరణిని మంచి అవకాశంగా తీసుకున్నారంటే ఆశ్చర్య మేమున్నది? బ్రిటిష వారిని నిందించే పనేమున్నది? వారికల్లా కావలసినది భారత దేశము వారిగుప్పిటలో వుండుటయే. ఇలా ఎంతకాలం సాధ్య మయితే అంతకాలం భారతస్వాతంత్ర్యవాంఛను నిరాకరించుటయే. ఏదో ఒకవంక వారికి కావాలి. దీనినే జిన్నాగారు వారికి సమకూర్చారు. జిన్నాగా రెవరైనా బ్రిటిషువారికి ఫరవాలేదు. తెలిసి కానివ్వండి, తెలియక కానివ్వండి జిన్నాగారు బ్రిటిషుసామ్రాజ్య వాదానికి మంచి పనిముట్టుగా ఉపయోగపడ్డారు. చూడండి! కాంగ్రెసు మంత్రులు బ్రిటిషు సామ్రాజ్యవాదుల వైఖరి భారత దేశంపట్ల అక్రమంగా వున్నదని తమ నిరసన వెలిబుచ్చుతూ రాజీనామాలు పెడితే జిన్నాగారు ముస్లింలీగు అధ్వర్యాన 'విముక్తి దినోత్సవము' జరిపించారు. చూశారా! ప్రజలచే ఎన్నుకోబడినమంత్రులు స్వామా

జ్యవాదుల వైఖరిని నిరసిస్తూ రాజీనామాలు పెడితే, ముస్లిం ప్రజానాయకుడనని చెప్పుకున్న జిన్నాగారు వారి నభినందించే బదులు పీడపోయిందిరా అని ఉత్సాహంతో విముక్తి దినోత్స వాలు జరిపించారు. ప్రజామంత్రివర్గాలుపోయి గవర్నరుల పరిపాలన రావడం ఎలాంటి విముక్తియో జిన్నాగారికే తెలి యాలి. వీరుకోరే పాకిస్థాన్ కూడా ఇలాంటిది కాదుగదా! దేశచరిత్రలో ఎన్నడూకూడా ఇంత అధ్వాన్నంగా ఏ రాజకీయ సంస్థ ప్రవర్తించి యుండ లేదు.

భారత ప్రజల ప్రభుత్వంకంటె బ్రిటిషు పరిపాలనే మహమ్మదీయులకు సౌఖ్యప్రదంగా వుంటుందని జిన్నాగారు నమ్ముతున్నారా? ఇంతేకాదు. ఇంకా విపరీతమయిన కార్య క్రమానికి జిన్నాగారి రాజకీయాలుపోయాయి. ప్రపంచమంతా మారణహోమములో తగులుకున్న రోజులలో యుద్ధజ్వాలలు నానాటికి వ్యాపించుచున్న రోజులలో భారతస్వాతంత్ర్య సాధనకు నడుకట్టవలసిన సమయములో జిన్నాగారు పాకిస్థాన్ నినాదాన్ని లేవనెత్తి ముస్లింప్రజల దృష్టిని స్వాతంత్ర్యోశయ మునుండి పెడమార్గములకు మరల్చారు. ఇలా స్వాతంత్ర్యోద్య మమునకు తీరని అపచారాన్ని చేసారు. బ్రిటిషుసామ్రాజ్య వాదులకు మంచిసాకును చేకూర్చి సహాయపడ్డారు.

ఈధోరణిలోయున్న జిన్నాగారికి ఆగస్టుతీర్మానంపట్ల వ్యతిరేకత యున్నదంటే అబ్బురమేమున్నది?

బ్రిటీషు సామ్రాజ్య వాదానికి బలాన్ని చేకూర్చే జిన్నాగారి ధోరణి, భారత జాతీయ స్వాతంత్ర్య సాధనకు నడుం కట్టిన గాంధీగారి ధోరణి ఎలా కలుస్తాయి? ఉత్తర దక్షిణ ధృవముల కున్నంత వ్యత్యాసమున్నది. గాంధి జిన్నా సంభాషణలు విఫల మవడానికి యీ విధాన వైరుధ్యమే ముఖ్య కారణము.

ముస్లింలీగు–కమ్యూనిస్టులు

1941 వ సంవత్సరంలో పాకిస్థాన సమస్యపై కమ్యూనిస్టు అను తమ రహస్యపార్టీ పత్రికలో యీక్రిందివిధంగా వ్రాశారు.

"జిన్నా ముస్లింలీగు నాయకత్వంకోరే పాకిస్థాన్ బ్రిటిషుసామ్రాజ్య వాదాన్నుండి మహమ్మదీయప్రజలకు స్వాతంత్ర్యాన్ని కోరుటలేదు. అది బ్రిటిషు ప్రభుత్వం క్రింద హిందూప్రజల బానిసత్వాన్ని ముస్లింప్రజల బానిసత్వాన్ని ప్రత్యేకంగా విడదీసి భాయపరువకోరుతోంది. బ్రిటిషుసామ్రాజ్యవాద పెత్తనంక్రింద హిందూ ఫెడరేషన్ ముస్లిం ఫెడరేషనలను స్థాపించాలని మాత్రమే జిన్నా అండ్ కంపెనీ కోరుతూంది. బ్రిటిషు దోపిడిగాండ్ర సహాయంతో యీపంపిణీ జరుగాలని కోరుతూంది. జిన్నా పాకిస్థాన నినాదాన్ని భారత స్వాతంత్ర్యనినాదాన్ని వ్యతిరేకంగా హిందువులు ముస్లిములు భారతప్రజలందరు యావన్మందికి ప్రధానశత్రువైన బ్రిటిషు ప్రభుత్వంతో గావించే పోరాటానికి వ్యతిరేకంగా యిస్తున్నాడు

జిన్నా మహమ్మదీయ ప్రజాసామాన్యము యొక్క మతవిశ్వాసాన్ని భారతస్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకంగా త్రిప్పటానికి తనపాకిస్థాననినాదాన్ని లేవదీశాడు. అందుచే జిన్నాకోరే పాకిస్థాన్ సామ్రాజ్యవాదులకు జాతీయ విద్రోహులకు తావవుతుంది. భారతప్రజావిప్లవానికి వ్యతిరేక మవుతుంది, బ్రిటిషు సామ్రాజ్యవాదులు మధ్యప్రాచ్యదేశాలలో సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా గావించేకుట్రలకు చేదోడవుతుంది. అందుచే కమ్యూనిస్టులం జిన్నాకోరే పాకిస్థాన్‌ను వ్యతిరేకించుతాము.

ఈ పైమాటలను యీ క్రింది వాక్యాలతో పోల్చి చూస్తే—

1941 వ సం॥లో జిన్నాకోరే పాకిస్థాన సామ్రాజ్యవాదులకు జాతీయవిద్రోహులకు తావిస్తుందన్న కమ్యూనిస్టులు 1942 వ సంవత్సరంలో తలవని తలంపుగా జిన్నా పాకిస్తాన్ నినాదాన్ని బలపర్చారు. ఈ కొన్ని నెలలలోనూ జిన్నా పాకిస్తాను యేమీ మారిపోలేదుగదా! 1940 లో చెప్పిందే యీనాటికీ జిన్నా చెబుతున్నాడు, కమ్యూనిస్టులుమాత్రం తమ వైఖరిని మార్చుకున్నారు. ముస్లింలీగు అభివృద్ధినిరోధక రాజకీయాలతో జమీందారుల ధనికుల ప్రాబల్యంతో పనిచేస్తుందని చెప్పిన కమ్యూనిస్టులే ముస్లింలీగు ముస్లింప్రజల జాతీయసంస్థ అంటూ ప్లేటు ఫిరాయించారు. ఇలాంటిమార్పుతో ముస్లింలీగు రాజకీయ నాయకత్వంలో రాజకీయనినాదాలతో, కార్యక్రమములో

నిర్మాణములో ఏలాంటిమార్పుకూడా రాలేదని ఘంటాపథంగా చెప్పవచ్చును. కమ్యూనిస్టుల స్వభావంలో మార్పు వచ్చి 1942 నుండి తాము అనుసరించిన ప్రజాయుద్ధ పంథాకు అనుకూలంగా మాత్రమే ముస్లింలీగుపట్ల తమ దృక్పథాన్ని మార్చుకున్నారు, అలాగే ఇతరులుకూడా మార్చుకోవాలంటారు. కాంగ్రెసు ముస్లింలీగుపట్ల మొదటినుండి ఒకేరకదృక్పథాన్ని అవలంభిస్తుంది. వీలైన కార్యాక్రమాలపై సాధ్యమైనపుడు రాజీకై ప్రయత్నించింది. పాకిస్తాన్ నినాదంపట్ల కాంగ్రెసువైఖరి మొదటనుండి ఒకేవిధంగా వుంది, జాతుల స్వయం నిర్ణయసూత్రాన్ని కాంగ్రెసు ఏనాడో గుర్తించింది. కాని జిన్నాకోరే పాకిస్తాను జాతీయవిద్రోహానికి దారిచ్చేదిగనుక బ్రిటిషు పరిపాలనను శాశ్వతంగా వుంచేదిగనుక వ్యతిరేకించింది.

"కమ్యూనిస్టులు - కాంగ్రెసు" (పేజీ 27) అనువ్యాసములో పి. సి. జోషి ఏమంటున్నాడో చూడండి. "ముస్లింలీగు మతసంస్థయని జిన్నా ప్రభుత్వానికి అనుకూలుడనియు, ఇప్పటికీ కాంగ్రెసు వాదు లనుకొంటున్నారు. ఇది నిజమేనా? గాంధీజీ కాంగ్రెసు సంస్థకు దేశానికి ఎలా పూజనీయుడో జిన్నా మహమ్మదీయ ప్రజా సామాన్యమునకు అలాంటివాడు. మహాత్ముని కాంగ్రెసువాదులు గౌరవించినట్లు, ఖ్వాయిదె అజామ్ మొదల ముస్లిము ప్రజలు గౌరవాన్ని చూపిస్తారు. మన మంతా కాంగ్రెసును జాతీయ సంస్థగా భావించినట్లే ముస్లిం

లీగును ముస్లింప్రజలు తమ జాతీయ సంస్థగా భావిస్తున్నారు. దీనికి కారణ మేమంటే 1919_20 వ సంవత్సరాలలో గాంధీజీ కాంగ్రెసును ప్రజాసామాన్యంలోకి తీసుకుపోయి ప్రజాసంస్థగా నిర్మించినట్లే జిన్నాకూడా ముస్లింలీగును ప్రజాసంస్థగా నిర్మించాడు."

"గాంధీజీ "స్వరాజ్యం" అనే నినాదంద్వారా భారతీయులందరి స్వాతంత్ర్యేచ్ఛను ప్రకటించినట్లే, జిన్నా "పాకిస్థాన్" నినాదంద్వారా ముస్లిముప్రజల స్వాతంత్ర్యాకాంక్షకు ఒక స్వరూపాన్ని యిచ్చాడు. ముస్లింలీగు ఇటీవల ఎలాఅద్భుతమైన రాజకీయసంస్థగా అభివృద్ధి అయిందో అర్థం చేసుకోడానికి వారు నిరాకరిస్తున్నారు."

**ఎన్ని జాతీయ సంస్థలు?**

ఈ పైమాటల్లో జోషీగారు తాము ముస్లింలీగునుగూర్చి అర్థంచేసుకున్న విషయాలు చెప్పినారు.

ముస్లింలీగు మహమ్మదీయు లందరికి ప్రాతినిధ్యం వహిస్తుందని వారివాదన. "మనమంతా కాంగ్రెసును జాతీయసంస్థగా భావించినట్లే, ముస్లింలీగును, ముస్లింప్రజలు తమజాతీయసంస్థగా భావిస్తున్నార"ట. "మనమంతా" అంటే ఎవరంతా?

హిందువులంతానా? అయితే, జోషీగారు హిందువుగ పరిగణింపబడటానికి అంగీకరిస్తాడా? లేక కమ్యూనిస్టులంతా

అనా? అలా అంటే అదితప్పే అవుతుంది. ఎందువల్లనంటే, కమ్యూనిస్టుపార్టీలోకూడ మహమ్మదీయు లున్నారుకదా? అలాంటి కమ్యూనిస్టులయిన మహమ్మదీయులు ముస్లింలీగునే తమ జాతీయసంస్థగా భావించాలికదా! ఎందువల్లనంటే, జోషీ అంటున్నట్లు "ముస్లింలీగు ముస్లిం ప్రజల జాతీయసంస్థ" కనుక "మనమంతా" అంటే, భారతీయులంతా అనేనా? కాని ముస్లిం లీగు ముస్లిమ్ప్రజల జాతీయసంస్థఅయితే, కాంగ్రెసులోనుండి ముస్లిములను మినహాయించాలికదా? అయినప్పుడు కాంగ్రెసు హిందువుల జాతీయసంస్థా? కనుక జోషీగారు "మనమంతా" అంటున్నప్పుడు పార్టీలపాలసీకి వ్యతిరేకంగా అంటున్నారు. మహమ్మదీయులైనకమ్యూనిస్టులు, హిందువులైనకమ్యూనిస్టులు కాంగ్రెసు వాదులైన కమ్యూనిస్టులు, ఇంకా ఎన్నో రకాల "కమ్యూనిస్టు" లున్నారు. కాని, జోషీగారి నిర్వాచనం ప్రకారం ముస్లిం కమ్యూనిస్టులు ముస్లిం లీగును తమ జాతీయ సంస్థగా భావించాలి హిందూ కమ్యూనిస్టులు న్యాయంగా హిందూమహాసభలో చేరాలి. కాని, వారు హిందూమహా సభపై దుమ్మెత్తి పోస్తున్నారు. ముస్లింలీగు చేసుకున్న పుణ్యా మేమిటో, హిందూమహాసభ చేసుకున్న పాపమేమొ పెరు మాళ్ళకే తెలియాలి. పోతే, కమ్యూనిస్టులకు తెలియాలి. అయితే, జోషీగారు కాంగ్రెసునే "హిందువుల సంఘం" గా మార్చి వేసినారు. ఇదే జిన్నాగారి "రెండుజాతుల" సూత్రం. హిందూజాతి, ముస్లిముజాతి-కాంగ్రెసు హిందూజాతీయ సంస్థ.

ముస్లింలీగు ముస్లిం జాతీయసంస్థ, ఇది జిన్నాగారి ధోరణి కూడా ఇదే! అయితే, జిన్నా చెప్పినంత అసందిగ్ధంగా, స్పష్టంగా జోషీగారు చెప్పరు. ఈ ఒక్క విషయమే కాదు. అన్ని విషయాల్లోను కమ్యూనిస్టులు ఇంతే చేసేదిచెప్పరు. చెప్పింది చేయరు ఒకటి చెబుతూ వే రొకటి చేస్తారు. అసలు విష యాన్ని మరుగుపరచి లేని విషయాన్ని సృష్టించి గొప్ప సమస్యగా చేస్తారు. అసాధ్యమైన పనులు ఇతరులు చేయాలంటారు అవి "అసాధ్యమైనవే" కనుక ఎవరూ చేయక పోతే, ఎం దుకూ పనికిమాలిన వారని నిందించుతారు. తాము చేస్తారా అంటే అదీ లేదు పైగా వారు మమ్మల్ని చేయనీయకుండా అడ్డు వస్తున్నారు. లేకపోతే ఈ పాటికి స్వరాజ్యమే తెచ్చేవా రం అని తమ పాలసీతో ఏకీభవించని వారి అందరినీ ఇష్టం వచ్చినట్లల్లా ఆడిపోసుకుంటారు ఇదే ధోరణిలో కాంగ్రెసు లీగు ఐక్యత సాధిస్తామంటూ బయలుదేరినారు. ప్రజాయుద్ధ నినాదం రాకపూర్వం గాంధీజీ జిన్నాగారితో సంప్రదించ డానికి పూనుకుంటే లేక కాంగ్రెసు ముస్లింలీగుతో రాజీపడ టానికి ప్రయత్నిస్తే అలా చేయడం 'బూర్జువా' ఐక్యతను సాధించడానికి ప్రయత్నమేననీ, హిందూప్రజల ముస్లింప్రజల ఐక్యత సాధనకు అది మార్గంకాదని ఏదో రెండుసంస్థల నాయ కులు కలసి మాట్లాడితేనే ప్రజల్లో ఐక్యత వస్తుందా? ఇదంతా 'గారడీ' చేసి, కాంగ్రెసులీగు రెండూకలసి ఏదో మంతనాలు జరిపి పడిక్కుల పంపకంలో రాజీకి వస్తామేమని, స్వాతంత్ర్య

పోరాటంలో ప్రజలను సమీకరించరు. అందువల్ల హిందూ ముస్లిం ఐక్యత స్వాతంత్ర్య పోరాటం ద్వారానే వర్గపోరాటం ద్వారానే, జాతీయరంగంలో ఏర్పడు తుంది. అని వాదించారు అలా ఆనాడు వాదించినవారే, కాంగ్రెసు లీగు ఐక్యత కావాలనీ అందుకుగాను గాంధి-జిన్నాలు తిరిగి కలవాలని రాండో లులా మోగుతున్నారు గాంధీకిజై - జిన్నాకుజై అంటూ నినాదాలు ఇస్తున్నారు, కాంగ్రెసు పతాకముతో పాటుముస్లిం లీగు పతాకమునుకూడ పెట్టుచున్నారు. గాంధీజీ చిత్రముతో పాటు జిన్నాగారి చిత్రమునుకూడ ఊరేగించుతున్నారు.ఇదంతా కాంగ్రెసును లీగును ఏకం చేయడానికి కమ్యూనిస్టుల కార్యక్రమం. ఇద్దరు నాయకులు కలసి మాట్లాడితేనే ప్రజలు ఏకం అయిపోతారా. అన్నవారే 'ఇద్దరు నాయకుల' చిత్రాలనుకలిపి ప్రజల్ని ఏకంచేస్తామంటున్నారు. ఈ ప్రచారమంతా ముస్లిం లీగు కాంగ్రెసుఐక్యతకు నిష్ప్రయోజనమే కాకుండా, అరిష్ట దాయకంకూడ. ఎందువల్లనంటే, ఈ కమ్యూనిస్టు ప్రచారం జిన్నాగారి రెండుజాతుల మాత్రానికి అద్భుతంగా ఉపయోగపడుతున్నది. కాంగ్రెసు హిందూసంస్థ అని చిత్రించుటకు ఉపయోగపడుచున్నది. ఇదేవాదన సామ్రాజ్యవాదులకు కావాలి! ఏమంటే, భారతదేశంలోని హిందువులకు మహామ్మదీయులకు 'పచ్చిగడ్డివేస్తే భగ్గుమంటుంది' అందువల్లనే మహామ్మదీయులసంస్థఅయిన ముస్లింలీగు - హిందువులసంస్థ అయిన కాంగ్రెసుతో కలవడంలేదు. ముస్లింనాయకుడు జిన్నా, హిందూ

నాయకుడు గాంధిజీ ఒక సమాధానానికి రాలేకపోయారు. అయినప్పుడు అధికారాన్ని వారికి ఎలా హస్తగతం చేయాలి? 'మేము సర్వసిద్ధమే' 'వారే అసమర్థులు' ఈధోరణిలోనే బ్రిటిషుసామ్రాజ్యవాదులు మాట్లాడుతుంటారు. నేడు కమ్యూనిస్టుపార్టీ ప్రచారంకూడ ఈవాదాన్నే బలపరుస్తున్నది.

అసలు సామ్రాజ్యవాదులు అలా ఎందుకంటారో తెలుసునా? ముస్లింలీగు రాజకీయాలు అభివృద్ధి నిరోధక రాజకీయాలని వారికి తెలుసు. అయినప్పుడు కాంగ్రెసును 'ముస్లింలీగుతో రాజీపడండి. తర్వాత తతిమ్మావిషయాలు మాట్లాడుదాం' అని అంటే, కాంగ్రెసుకు అప్పుడు రెండేమార్గాలున్నాయి. (1) కాంగ్రెసుకూడ ముస్లింలీగు రాజకీయాలస్థాయికి దిగజారాలి. అలా ముస్లింలీగుతో రాజీకి రావడానికి అభివృద్ధి నిరోధకపంథాలోకి దిగటమా (2) లేక, కాంగ్రెసు, ముస్లింలీగుతో రాజీ అసంభవమని, (అంటే, ముస్లింలీగు రాజకీయాలు అభివృద్ధినిరోధకంగా వున్నంతకాలం అసంభవమని) తన కార్యక్రమాన్ని తాను సాగించుకోవడం.

ఈసందర్భంలో ఒక్కవిషయం మనస్సులో ఉంచుకోవాలి. కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామాలిచ్చివేస్తే ముస్లింలీగు మంత్రివర్గములను ఏర్పరచుకోడానికి సామ్రాజ్యవాదులతో చెలిమిచేస్తున్నది. ముస్లింలీగు మంత్రులు. 'డిఫెన్సు ఆఫ్ ఇండియా ఆక్టుతో' అమలు జరిపారు. 1942 ఆగస్టులో వచ్చిన ప్రజావిప్లవాన్ని అణచివేయడానికి సామ్రాజ్యవాదులకు తోడ్ప

రేకెత్తిఉనాగేలారు. కాంగ్రెసువాదులు జైళ్ళలో మ్రగ్గుతూవుంటే, ముస్లింలీగువారు ప్రభుత్వపక్షంలోనున్నారు. జిన్నాగారుకాని, మరి యేయితర ముస్లింలీగు నాయకుడుగాని, ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని నిరశించలేదు. పైగా జిన్నాగారి ముస్లింలీగు మంత్రులు నిర్బంధవిధానాన్ని సాగించారు.

పైగా, జిన్నాగారు ఆగస్టు తీర్మానము ముస్లిములకు వ్యతిరేకమైనదని ప్రకటించి కాంగ్రెసుపైకి మహమ్మదీయులను రెచ్చగొట్టుటకు యత్నించారు. ఇలా ప్రభుత్వమును బలవరచే వైఖరి కాంగ్రెసును వ్యతిరేకించే వైఖరి గల ముస్లింలీగు ముస్లిం లందరియొక్క జాతీయసంస్థ ఎలా అవుతుంది? అలా అయితే ముస్లిములందరు కాంగ్రెసువ్యతిరేకంగా నున్నారా? కాంగ్రెసులో వేలవేలుగా ముస్లిము లున్నారు. కాంగ్రెసు అధ్యక్షుడు అబ్దుల్ కలాం అజాద్ ముస్లింకాదా? ఇంకా జాతీయముస్లిముల సంఘములుకూడ నున్నవి. ఇవ్వన్నీ కాంగ్రెసును బలపరుస్తూ ముస్లింలీగు వైఖరిని వ్యతిరేకిస్తున్నాయి. ఇలాంటి లీగుతో కాంగ్రెసు రాజీ పడాలంటే, కొంతవరకయినా కాంగ్రెసు కూడ అస్థాయికి రావాలి. ఇలావస్తే బ్రిటిషువారికి మరీమంచిది. వారు శాశ్వతంగా మనదేశాన్ని పరిపాలించ వచ్చును. అలా రాకపోయినా, కాంగ్రెసు లీగు ఐక్యత లేదు గనుక మా తప్పేమున్నది వారిలో వారికే మాట కుదరలేదు. అని సాకు చూపెట్టి తమ పరిపాలన సాగించుకోవచ్చు. ఇందువల్లనే ఈ సినాదం

బ్రిటీషు వారికి పాటంగా వున్నది. వారి కత్తికి రెండువైపులా పదును వున్నది.

పోతే కమ్యూనిస్టులుకూడ కాంగ్రెసులీగు ఐక్యత నినాదం ఎందువల్ల ఇవ్వవలసి వచ్చిందో చూశాం. ఈసందర్భంలో గుర్తుంచుకోవలసిన విషయ మేమంటే ఈ నినాదాన్ని కమ్యూనిస్టులు ఎప్పటినుండి ఇస్తున్నారు. వారు ప్రజాయుద్ధ నినాదము ఇచ్చిన తర్వాతనే కాని, ముందుకాదు. అంతకుముందు ఎందువల్ల ఆ నినాదాన్ని ఇవ్వలేదు, "సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా" మార్చాలనే పాలసీలో కమ్యూనిస్టులు అప్పుడు ఉండేవారు. ఆరోజుల్లో జర్మన్ సోవియట్ ఒడంబడిక అమలులో వున్నది. అందువల్ల, బ్రిటిషు సామ్రాజ్యవాదులపై కాంగ్రెసును రెచ్చగొట్టాలి. అలాగే ప్రజలందర్ని, అప్పుడు కాంగ్రెసు ముస్లింలీగు ఏకమై తర్వాత సామ్రాజ్యవాదుల పని పట్టాలని అనలేదు. పైగా, ముస్లింలీగు, జిన్నా, సామ్రాజ్యవాదులకు కీలుబొమ్మలాంటి వాళ్ళు అభివృద్ధినిరోధక తత్వంలోనున్నారు. అంటూ జిన్నాపై దుమ్మెత్తిపోశారు. ఎందువల్ల? కమ్యూనిస్టులకు తెలుసును ఏమనంటే, ముస్లింలీగు ప్రభుత్వా అనుకూలమైన దేనన్ని, ప్రభుత్వంపై ఎట్టి పోరాటాన్ని తీసుకు రాదనీ అందువల్ల కాంగ్రెసువారినికూడ ముస్లింలీగుపై రెచ్చగొట్టడానికి యత్నించారు, కాని, ప్రజాయుద్ధ నినాదము వచ్చింది. కమ్యూనిస్టులు సామ్రాజ్య వాదానికి అనుకూలంగా యుద్ధ ప్రయత్నాలను బలపరచవలసి వచ్చింది. ఇదివరకు సామ్రాజ్య

వాద వ్యతిరేక శిబిరంలోనున్న కమ్యూనిస్టులు, సామ్రాజ్య అనుకూల శిబిరంలోకి వచ్చారు. ఇదివరకే ముస్లింలీగు ఆశిబిరంలోనున్నది. కాబట్టి, ముస్లింలీగు, కమ్యూనిస్టులు, సామ్రాజ్యవాదుల శిబిరంలో కలుసుకున్నారు. అప్పటినుండి కమ్యూనిస్టులు "ముస్లింలీగును ప్రజల జాతీయ సంస్థ" గా ప్రచారం చేయడం ప్రారంభించినారు. కాంగ్రెసు - ముస్లింలీగు ఐక్యత జాతీయ ప్రభుత్వాన్ని సాధించుతుందని ప్రచారం చేస్తున్నారు అంటే కాంగ్రెసు ముస్లింలీగుతో రాజీపడటం ఎప్పుడు సంభవిస్తుందంటే కాంగ్రెసుకూడ సామ్రాజ్యవాదుల శిబిరంలోకి నడిచినప్పుడే.

| |
|---|
| ఎవరు<br>ఏ శిబిరంలో<br>వారు ? |

స్వాతంత్ర్య శిబిరంలో ఉండి సామ్రాజ్యశిబిరంలోనున్న వారితో రాజీ ఎలా పొసగుతుంది? లేకుంటే, సామ్రాజ్యవాదుల శిబిరంలో నున్నవారు, స్వాతంత్ర్య శిబిరంలోకి వచ్చి నప్పుడు ఆగస్టు తీర్మానము ఈవిషయాన్ని తేల్చి వేసింది. ఆగస్టు తీర్మానాన్ని వ్యతిరేకించిన వారందరూ సామ్రాజ్యవాదుల కుటీరములోని వారే. 'ముస్లింలీగు, కమ్యూనిస్టులు లాయలిస్టులు.'

ఆగస్టుతీర్మానాన్ని బలపరచిన వారంతా స్వాతంత్ర్య శిబిరంలోనివారే.

అందువల్ల కాంగ్రెసులీగు రాజీ అను కమ్యూనిస్టుల నినాదము భారత జాతీయ కాంగ్రెసును తమతోపాటు లీగు

తోకను కట్టి సామ్రాజ్యవాద శిబిరంలోకి ఈడ్వడానికి పన్నాగము. దీనికి ఇంకా రుజువు ఏమంటే కమ్యూనిస్టులు కాంగ్రెసును బలపరుస్తూ, ముస్లింలీగును కాంగ్రెసు పంథాలోకి తీసుకురావడానికి యత్నించడము లేదు. తద్వ్యతిరేకంగా లీగును బలపరుస్తూ కాంగ్రెసును లీగు పంథాలోకి రావాలంటున్నారు. పోనీ, జాతీయ ప్రభుత్వ సాధనకే ఇలా కాంగ్రెసు లీగు ఐక్యతను వీరు కోరుతున్నారంటే, అదీకాదు, కాంగ్రెసులీగు రెండూకలసి బేషరతుగా ప్రభుత్వానికి సహాయం చేయాలి. అప్పుడు జాతీయ ప్రభుత్వాన్ని సాధించుకోవచ్చు. ఇలా ప్రచారం చేస్తున్నారు. ఇదంతా స్వాతంత్ర్యోద్యమాన్ని బలహీనపరచి సామ్రాజ్యవాదాన్ని బలపరచే పంథా. పూర్తిగా కాంగ్రెసుపాలసీకి వ్యతిరేకమైనది.

"ముస్లింలీగు 10 కోట్ల మహమ్మదీయులకు ప్రాతినిధ్యం వహిస్తుందని చెప్పడము" కాంగ్రెసును ముస్లింలనుండి దూరం చేయడానికి పన్నుగడ. ఇలాచేయడం కాంగ్రెసును బలహీనపరుచుటే. కనుక ప్రస్తుతము ముస్లింలీగుపట్ల కమ్యూనిస్టుపార్టీ వైఖరి పూర్తిగా కాంగ్రెసును ధ్వంసము చేద్దామనుకునే పార్టీ వైఖరిగానే వున్నది. (ఇందులో ముస్లిం రాజకీయాలనుగూర్చి కమ్యూనిస్టు—కాంగ్రెసు వైఖరులనుగూర్చి వివరంగా వ్రాయలేదు. త్వరలో 'ముస్లిము రాజకీయములు' అను పేరుతో ఒక పుస్తకాన్ని ప్రకటించబోతున్నాము.)

# ఉత్తర దక్షిణ ధృవాలు

"కమ్యూనిస్టులు కాంగ్రెసు" అను వ్యాసములో ఒక టవ పేజీలోని ప్రారంభవాక్యాలలో జోషీభావాలు, "గాంధీజీ విడుదలయిన తరువాత, విధ్వంసకచర్యలను ఖండించుతూ, గౌరవప్రదమయిన సంధికి సిద్ధమంటు ఆయన వైస్రాయికి ఒక లేఖ వ్రాసాడు. ఈరెండూ వ్రాసినప్పుడు, ఇదివరదాకా కమ్యూనిస్టులు చెప్పినదే యిప్పుడుగాంధీజీ చెప్పుచున్నాడురా అని ఇది దేశభక్తులందరిలో దాదాపు వ్యాపించినభావము" 'అమాయక చక్రవర్తి' లెవరో తప్ప జోషీగారి బుకాయింపును విశ్వసించరు.

గాంధిజీ పంధాకు జోషీపంధాకు పూర్తివైరుధ్యం ఎలా వున్నదో పుస్తకంలో వివరించాము. ఎవరయినాసరే కమ్యూనిస్టు పంధాకు-కాంగ్రెసు పంధాకు పెద్ద వ్యత్యాసము లేదని అంటే వారిని ఈదిగువ ప్రశ్నలు అడగండి.

1 కమ్యూనిస్టు 'విప్లవకారులు' యుద్ధ డిపార్టుమెంటులో చేరుతున్నారు. సివిక్‌గార్డులుగా పనిచేస్తున్నారు. కాని, కాంగ్రెసువాదులు, అలా ఎందువల్ల నవక్ష్మమొంటు ఉద్యోగా

చేరడం లేదు? యుద్ధానంతర పునర్నిర్మాణ సంఘాలలో కూడ కమ్యూనిస్టులు ప్రభుత్వము వారిచే నియమింపబడుచున్నారు. కాని గొప్పగొప్ప కాంగ్రెసు వారుకూడ నియమింపబడలేదు. ఎందువల్ల?

(2) కాంగ్రెసు ప్రజాయుద్ధసిద్ధాంతాన్ని అంగీకరించిందా? కాంగ్రెసు యుద్ధంపట్ల తన వైఖరిని మార్చుకో లేదుగదా? స్వతంత్ర భారతదేశమే హృదయపూర్వకంగా యుద్ధంలో పాల్గొంటుందని ఖచ్చితంగా కాంగ్రెసు చెప్పిందిగదా? జైలు నుండి విడుదల అయిన తర్వాత గాంధీజీకూడ తిరిగి అలాగే చెప్పారుకూడ. బ్రిటను భారత ప్రజలతో సమాధానానికివచ్చే టంతవరకు ఏ విధంగా కాని, ఏ సమస్యపై గాని, కాంగ్రెసు వాదులు బ్రిటిషు ప్రభుత్వానికి సహాకారము చేయకూడదు. ఏ కాంగ్రెసు వాదికూడ ఏలాంటి గవర్నమెంటు కార్యక్రమంలోగాని, ఏ గవర్నమెంటు కమిటీలోగాని సహకారము చేయకూడదు. కాని కమ్యూనిస్టులు అన్నిచోట్ల గవర్నమెంటుతో పూర్తి సహకారము చేస్తున్నారు గదా?

(౩) ఇలా గవర్నమెంటుతో సహకారము చేయుటవల్ల కమ్యూనిస్టులు కాంగ్రెసు పాలసీకి పూర్తిగా విరుద్ధంగా ప్రవర్తిస్తూ కనీసం ప్రాథమిక శిక్షణకుకూడ వ్యతిరేకముగా పోయి కాంగ్రెసు డిసిప్లిన్‌ను ఉల్లంఘించినారుకదా? అయినప్పుడు ఇంకా కాంగ్రెసులో ఏలా కమ్యూనిస్టులు వుండుట సాధ్యమవుతుంది? కాంగ్రెసుతో అభిప్రాయభేదాలు వచ్చిన శ్రీరాజ

గోపాలాచారిగారు, శ్రీ మున్షీగారు కాంగ్రెసుకు రాజీనామా నిచ్చి బయటకు పోయారు. కాని, కమ్యూనిస్టులు కాంగ్రెసు ప్రధానసూత్రములతోనే వ్యతిరేకముగా వుండికూడ ఎలా కాంగ్రెసులో వుండగలరు?

(4) ముస్లింలీగుతో రాజీ విషయంలోకూడ గాంధీజీ పంథా కమ్యూనిస్టు పంథాకు ఏ పోలికా లేదు. 1. గాంధీజీ తన సూచనలో పూర్ణస్వరాజ్య వాంఛను పూర్తిగా బలపరచాలని ముస్లింలీగును కోరారు. కమ్యూనిస్టులు ఇలా చేయలేదు. పాకిస్తాన్ విషయంలో కూడ ఆయాప్రాంతములో నివసిస్తున్న ప్రజల అభిప్రాయాన్ని ఓటింగుద్వారా తెలుసుకుని అత్యధిక సంఖ్యాకులు స్వయం నిర్ణయ సూత్రాన్ని అమలు జరుపుకుని ప్రత్యేక రాజ్యాంగంగా ఉండవచ్చునన్నారు. కాని కమ్యూనిస్టులు అలా ఆయా ప్రాంతాల్లోని ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకోకుండానే పాకిస్తాన్ అంగీకరించాలని జిన్నాను బలపరుస్తున్నారు. ఈరెండు పంథాలు పరస్పర వ్యతిరేకములయినప్పుడు గాంధీజీ చెప్పేది, కమ్యూనిస్టులు చెప్పేది ఒకటి ఎలా అవుతుంది?

(5) కమ్యూనిస్టులు "జాతీయ ఐక్యతద్వారా జాతీయ ప్రభుత్వము స్థాపించి జాతీయ రక్షణచేయాలి." అంటే బ్రిటిషు యుద్ధ ప్రయత్నాలకు పూర్తి సహాకారం చేయడానికి కాంగ్రెసులీగు ఐక్యత అని కమ్యూనిస్టు లంటారు. గాంధీజీ పూర్ణ స్వరాజ్యం కొరకు లీగుతో సంప్రదించాడు. కమ్యూనిస్టులు

తమ ప్రజాయుద్ధ నినాదాన్ని అమలు పరచ డానికే లీగుతో ఐక్యం కావాలంటాము, కాంగ్రెసు పూర్ణస్వరాజ్య పంథా, కమ్యూనిస్టు ప్రజాయుద్ధ పంథాలో లీగుతో ఏకం కావాలన డం పూర్తి వ్యతిరేకమైన ఆశయాలు గావా?

5. ఆగస్టుతీర్మానానికి కమ్యూనిస్టులు పూర్తి వ్యతిరేకులుకారా? అయినప్పుడు కాంగ్రెసు 'అఫీషియల్' పాలసీకి వ్యతిరేకంగా ఉంటూ ఎలా కాంగ్రెసువాదులు అవుతారు?

కమ్యూనిస్టుల పాలసీ ఎలా కాంగ్రెసుకు పూర్తి వ్యతిరేకముగా నున్నదో వివరించాం. కాని కమ్యూనిస్టులు తామూ కూడ కాంగ్రెసువారమేనంటూ మిన్నూ మన్నూ ఏకం అయ్యేలాగ గగ్గోలు చేస్తున్నారు. ఇదంతా, కాంగ్రెసును ప్రక్కవాటుగా దెబ్బతీసి తమ పార్టీని బలపరచుకొనుటకే రైతుల్లోను విద్యార్థుల్లోను, యువకుల్లోను, స్త్రీలలోను, పేదల ప్రజలందరిలోను కాంగ్రెసుకు స్థానము లేకుండా చేయుటకు రైతు సంఘాలు, విద్యార్థిసంఘాలు, మహిళాసంఘాలు, బాలసంఘాలు, కార్మికసంఘాలు, అంటూ బయలుదేరతీసి ఆయాసంఘాల ద్వారా ఆయావర్గాలను తమపార్టీనాయకత్వముక్రిందకు తెచ్చుకొనుటకు యత్నిస్తూ, కాంగ్రెసుకు ప్రజలలో ఏవర్గంలోకూడ పలుకుబడి లేకుండా చేద్దామని, తర్వాత కాంగ్రెసునే సర్వనాశనం చేయవచ్చునని వీరు భగీరథ ప్రయత్నాలు చేస్తున్నారు. చూడండి. ఈనాడు కమ్యూనిస్టులు నిర్మిస్తున్న అన్ని సంఘాలు గ్రామఫోనుప్లేటు మాదిరిగా కమ్యూనిస్టు పాలసీనే

బలపరుస్తున్నాయి. కాంగ్రెసు పాలసీకి వ్యతిరేకముగా ఉంటున్నాయి. ఇలా కమ్యూనిస్టులు తాము స్థాపించుతున్న వర్గసంఘాలద్వారా కాంగ్రెసు వ్యతిరేక వాతావరణాన్ని సృష్టించి, కాంగ్రెసునే తలక్రిందులు చేటామని విపరీతంగా కృషిచేస్తున్నారు. ఇలా కాంగ్రెసుపై కత్తికట్టి బాహాటంగా మేము కాంగ్రెసు వ్యతిరేకులమని చెప్పుకోడానికి దమ్ములు లేక రహస్యంగా, లోలోన తమ పార్టీ సభ్యులకు కాంగ్రెసు వ్యతిరేక 'తారకమంత్రాన్ని' ఉపదేశిస్తూ, రైతుల్లో, కూలీల్లో, విద్యార్థుల్లో, యువకుల్లో కూడ సంఘాలు స్థాపించి కాంగ్రెసు వ్యతిరేకులుగా ప్రజలందర్ని తయారుచేద్దామని కుట్రపన్నుతూ వస్తున్నారు. కనుక క. పార్టీవారు స్థాపించిన ఏసంఘాన్ని బలపరచినా, కాంగ్రెసును బలహీన పరచినట్లే అవుతుంది. కాంగ్రెసుపై కమ్యూనిస్టుల కుట్రకు దోహదం ఇచ్చినట్లే అవుతుంది. కాంగ్రెసును బలపరచే రైతుకాంగ్రెసు, యువజన కాంగ్రెసు, విద్యార్థి కాంగ్రెసు ఇలాంటి జాతీయ సంఘాలలో నేచేరి, కాంగ్రెసును బలపరచి కమ్యూనిస్టు కుట్రదారులకు శృంగభంగం అయ్యేలా చేయడమే జాతీయ ధర్మం.




ఇలా అబద్ధాలలో పుట్టి పెరిగినవారు, కమ్యూనిస్టు సద్యానెల్లర్లు - వ్యతిరేకులు వచ్చి అబద్ధాలు అంటూ, ఒక కరపత్రాన్ని ప్రకటించారు. ఆ కరపత్రంలో 1 వ పేజీలో చంద్ర రాజేశ్వరరావు అబద్ధంతోనే "విఘ్నేశ్వర పూజ"

ప్రారంభించాడు. చూడండి. "చాటుగా ఒకటి, బహిరంగంగా ప్రజలలో ఒకటి చెప్పడం అంటూనే కమ్యూనిస్టు పార్టీకి లేదు ఎంత "సత్య హరిశ్చందు్రలు" అయితే భారత కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజేషనల్ రిపోర్టులో (ప్రజాశక్తి ప్రచురణ 8 డిసెంబరు 1943 పేజీ 29 లో మొదటి రెండువంక్తులు) రాజేశ్వరావు గురువు పి. సి. జోషీ ఏమంటున్నాడో చూడండి. "ఇండ్లలో జరిపే, సభల్లో యిచ్చే ఉపన్యాసాలకు, బహిరంగ సమావేశాలలో గావించే ఉపన్యాసాలకు తారతమ్యం చూపెట్టాలి"

ఇండ్లలో జరిపే చాటు సభలకు అంటే పార్టీ సభ్యులు సానుభూతి పరులకు చేసే ఉపదేశాలకు, కాంగ్రెసు వ్యతిరేకత మొదలైనవి బోధిస్తారు. ప్రజలకొరకు జరిగే బహిరంగసభల్లో "మేము కూడ కాంగ్రెసు వారమే" అని చెప్పుకుంటారు. అలా కాకుండా ప్రజల్లోకూడ బహిరంగంగా కాంగ్రెసు వ్యతిరేక ప్రచారం చేయరు. చాటుమాటుగానే చేయాలని జోషీగారి ఆజ్ఞ. ఇది రాజేశ్వరావుకు సుగ్రీవాజ్ఞ, కాని చాటుగా ఒకటి బహిరంగంగా వేరొకటి చెప్పడం అంటూనే మాకు లేదని పెద్ద అబద్ధాన్ని విసిరారు, ఈ ప్రబుద్ధుడు (పార్టీనిర్మాణము. ప్రజాశక్తి ప్రచురణ నెం 53 మార్చి 1944 ద్వితీయ భాగం - పేజి. 49 లో) ఏమి వ్రాసాడో చూడండి

"ఆయా సంఘాల పరిస్థితులనుబట్టి, కమ్యూనిస్టులంగా బహిరంగంగా చెప్పుకుంటూనో లేక కమ్యూనిస్టులంగా ప్రకటిం

చకుండానో పని చేస్తాం. ఆ సంఘాలలో వుండి ఆ నాయకత్వాన్ని ప్రతిఘటనలోనూ బట్టబయలు చేస్తూ వారిని ప్రజలనుండి దూరం చేస్తాం" "దీని భావమేమి తిరుమలేశ" ఈ మాటలన్నీ "గుటకాయ స్వాహా" చేసి జీర్ణం చేసుకున్నారా? కమ్యూనిస్టులకు చాటు మాటు లేదని అంటున్నవారే "కమ్యూనిస్టులుగా బహిరంగంగా చెప్పకుంటూనో, కాక కమ్యూనిస్టులుగా ప్రకటించకుండానే చాటుగా పనిచేస్తామని చెప్పకుంటున్నారు. ఇదంతా భద్రయ్య సామెతగా వుంది. ఒకానొకప్పుడు ఒక భద్రయ్యగారు భలే వాటంవారిగా ప్రవర్తించేవాడట. వైష్ణవులున్న ఊరుపోతే నాపేరు రామభద్రయ్య అనేవాడట శైవులున్న ఊరుపోతే నా పేరు వీరభద్రయ్య" అనేవాడట. రాజేశ్వరావుకూడ ఇదే "కళను" అభ్యసించి నట్టున్నాడు. భద్రయ్యకళ!

అంతేకాదు. "ఆ సంఘాలలో ఉండి, ఆనాయకత్వాన్ని ప్రతిఘటనలోనూ బట్టబయలు చేస్తూ ప్రజలనుండి దూరం చేస్తాం" అని రామ్మూర్తి చరచుకొని పళ్ళు నూరుతున్నారు. అంటే ఆ యింటినీడనే వుంటూ, "తిన్నింటి వాసాలు లెక్కపెడతా" రన్నమాట. "యింటి దొంగని ఈశ్వరుడయినా పట్టలేడని" కాబోలు వీరిధీమా! అయ్యా! తమరు కాంగ్రెసులో చేరతామనేది ఇందులకేనా? కాంగ్రెసులోనే ఉండి. ఆ నాయకత్వాన్ని ప్రతిఘటనలోను బట్టబయలు చేస్తూ, ప్రజలనుండి దూరం చేయాలనా తమ సంకల్పం? యిదీ అసలు రహస్యం.

అయితే మంచి చెడ్డలు ఆలోచించకుండా ప్రతిఘటనలోను నాయకులను బట్టబయలు చేయడమే మీ అభిమతమా! అయితే ఆ నాయకులు కొన్ని మంచి పనులు చేసినా, వారిని మీరు ఎదుర్కొంటా రన్నమాట! ఓహో! ఈ పాలసీ ప్రకారమే కాంగ్రెసు నాయకులు చేసిన ప్రతిపనిని మీరు ఎదుర్కొన్నారు కదూ! ఎంతో నిలకడగా కాంగ్రెసు నాయకుల్ని వ్యతిరేకిం చారు. ఎంత సాహసం! అయితే కాంగ్రెసు నాయకులను ప్రజ లనుండి దూరం చేయడానికి బదులు మీరే ప్రజలకుదూరమయి పోయారు "తానొకటితలిస్తే, దైవమొకటి చేసాడట' మింటి పైకెగర బోయి మింటిపై చతికిల బడ్డట్లుగా వుంది. ఇందుకు మీకు మా సానుభూతి!

"కమ్యూనిస్టు నయ్యాల్లర్లు వ్యతిరేకుల పచ్చిఅబద్ధాలు" అనే పుస్తకంలో (34 పేజీలో) ఏమంటున్నారో చూదాం. 'కమ్యూనిస్టు వ్యతిరేకుల కొకమాట! కమ్యూనిస్టు వ్యతిరేకత మిమ్మల్ని చివరకు గోతిలోకి తీసుకు వెళుతుంది. ...... ఇప్పటి కైనా బుద్ధి తెచ్చుకుని అబద్ధాలు మానండి."

"తాటాకు చప్పాళ్ళకు కుందేళ్ళు బెదురుతాయా?" కమ్యూనిస్టు వ్యతిరేకత మమ్మల్ని గోతిలోకి తీసుకు వెళుతుందో మరెక్కడకు తీసుకు వెళుతుందో ముందు జరుగ వలసిన విష యం కదా?

"కాగల కార్యం గంధర్వులే సాగిస్తారు." ఆ మాట అలా వుంచండి. కాంగ్రెసు వ్యతిరేకత మిమ్మల్ని ఎంతలోత

యిన గోతిలోకి తీసుకు వెళ్ళిందో తమరు సెలవిస్తారా? మిమ్మల్నే ఎందుకు కదుపుతున్నామంటే మీ మనస్సుల్లో కాంగ్రెసు వ్యతిరేకత ఎంతలోతుగా నాటుకుపోయిందో, అంతలోతయినా గోతిలోనే మీరున్నారు. కనుక! చాలా దిగువ గోతిలో నున్న వారి బుద్ధికూడ అంత దిగువగానే వుంటుంది. అందుచేత ఆ రచయితకే 'బుద్ధి' అవసరమని తేలిపోయింది. మేముఉచితంగా ఒక సలహాను యిస్తున్నాం. మీకు నచ్చినా సంతోషమే. స్టాలిన్‌కు అర్జీపెట్టి రష్యానుండి మీకు ఎంత బుద్ధి కావాలో „ఆర్డరు" ఇవ్వండి. ఎలాంటి "బుద్ధి" పంపుతాడో మీకు తెలుసునుకదా! మంచి నాణ్యమైన సరుకు అవునా! మన దేశంలో ఉన్న 'బుద్ధి' మీకు గిట్టదు! నిజమేనా!

"కమ్యూనిస్టుసర్క్యులర్లు వ్యతిరేకుల వచ్చిఅబద్ధాలు" అను పుస్తకంలో మేము లేనిపోనివి కల్పించినట్లుగా ఎంతమాత్రము రుజువు చేయు లేక పోయారు. కాకపోతే, వారి సర్క్యులర్లనుండి మేము కొన్ని భాగాలను ప్రకటించితే వారు ఇంకా మరికొన్ని వాక్యాలు కలిపినారు. అంతేగాని, మేము ప్రకటించినవి అసలు వారి సర్క్యులర్లలో లేవని అనడంలేదుగదా అయినప్పుడు "నెంబరు" వారీగా వచ్చి అబద్ధాలని పెద్దఅక్షరాలతో అచ్చువేయిస్తే, ఏం ప్రయోజనం చెప్పండి. గుడ్డెద్దు చేలో పడ్డట్టుగా పార్టీ చెప్పేదల్లా 'వేదవాక్కులు' గాభావించే అతినవీన ఛాందస చక్రవర్తులైన పార్టీసభ్యుల్లా మీవ్రాతలు పనిచేయవచ్చు గాని ప్రజలను మోసగించలేరు. ఎన్ని దొంగ

వేషాలు వేసినా, ఏమి ప్రయోజనము లేదు. మీ సభ్యుల ర్గలో ఇలా రహస్యంగా గూడుపుఠాణీ మీరు సాగిస్తున్నట్లుగా స్పష్టంగా కనిపిస్తుంటే మాకు అంతా బట్టబయలే అంటే ఎవరు నమ్ముతారు? ఇదిగో చూడండి.

"పొలిటికల్ సర్క్యులర్ నెం. 20/44 పార్టీ సభ్యులకు మాత్రమే." (2-12-44)

కామ్రేడ్స్,

పార్టీసభ్యులు, ప్రజలచేతుల్లో డబ్బులు ఆడే రోజులు వచ్చాయి. ఫిబ్రవరి లోపుగానే 1945 సంవత్సరానికి కావలసిన డబ్బు పోగుచేసుకోవాలి. ఈ సమయం దాటిపోతే, మనం పోగుచేయగలిగేది బహుస్వల్పం. పార్టీకి సంవత్సరానికి కావలసింది. రూ 1,25, 000 లు. వివిధజిల్లాలు ఈ క్రిందికోటాల ప్రకారం డబ్బు వసూలు చేయాలి.

కృష్ణా 50000 గుంటూరు 30000, పశ్చిమగోదావరి 15000, తూర్పుగోదావరి 7000, నెల్లూరు 6000, వైజాగ్ 1000, అనంతపురం 2000, కర్నూలు 2000, చిత్తూరు 1000, కడప 500, సెంటు 10500. మొత్తం ఒక లక్షా ఇరవై అయిదు వేలు.

పార్టీ ఫండు పోగుచేయడానికి ఈ క్రిందిసూత్రాలు అవలంభించాలి.

1. పార్టీకి బాగుగా పలుకుబడివున్న గ్రామాలలో (Red villages) పార్టీకి వసూలు చెయ్యాలి. పార్టీకి ఇచ్చే అవకాశం లేనివారి నుండి రైతుసంఘానికి వసూలు చేయాలి.

2. మిగతా గ్రామాలలో రైతుసంఘంపేరులోనే వసూలు చెయ్యాలి. ఆగ్రామాలలో ఉన్న పార్టీకి గట్టి సాను భూతి పరులవద్దనుండి కొంత రైతు సంఘానికి. కొంత పార్టీకి తీసుకోవాలి.

3. అవకాశమున్నచోట కోతలు, కట్టివేతలు కంట్రాక్టు తీసుకొని, పార్టీఫండు సంపాదించవచ్చును.

4. యువజన మహిళా సంఘాలు గ్రామంవెంట తిరిగి ఫండు వసూలు చేయుటగూడదు. యువజనసంఘాలు ప్రత్యేక పలుకుబడి వున్నచోట కోతలు, కట్టివేతలు ద్వారాను, సంక్రాంతిపండుగ కార్యక్రమాలలోను వసూలు చేసుకోవచ్చును.

మహిళాసంఘాలు తమ సంఘంయెడల ప్రేమ ఉన్న వారివద్దనుండి మాత్రమే వసూలు చెయ్యాలి.

5. వ్యవసాయకూలీసంఘం కోతలు, కట్టివేతలు ద్వారాను, అది సాధ్యపడనిచోట కూలీపేటలలోను ఫండు వసూలు చేయవచ్చును.

6. రు 10 లు లోవుగా ఫండుయిచ్చేవారి వద్దనుండి గింజల రూపంలో కళ్ళంవద్దను వెళ్ళి వసూలు చేయాలి. అంతకుపైన ఇచ్చేవారివద్దనుండి డబ్బురూపంలో వసూలుచేయాలి.

ఈసూత్రాన్ని పరిస్థితులనుబట్టి ఉపయోగించాలి_" ఇలాంటి రహస్య సర్క్యులర్లు జారీ చేస్తూనే, మాటుచాటుమాటు లేదంటారు! అర్యా, పై సర్క్యులరులోని విషయాలు తమపార్టీకి ఎలా రైతు, యువజన , మహిళా, వ్యవసాయ కూలీసంఘాలు వేరువేరు వేషాలో తెలియచేస్తున్నాయి. దొంగ వాడికి కావలసి నన్ని బురఖాలు! ఎలాగోలా, ప్రజలను మోసగించడమే వాడి ఆశయం.

ఇదంతా 'చాటు' వ్యవహారం కాకపోతే, 'పార్టీ సభ్యులకు మాత్రమే' నంటూ ఎందుకు నిర్ణయించాలి మీ ప్రజాశక్తిలో ఎందుకు ప్రకటించ కూడదు? మీరు జిల్లాల వారీగా కోటాలు నిర్ణయించినంత మాత్రాన, మీకు డబ్బు ఎక్కడ నుండి వస్తున్నదో ప్రజలు అర్థం చేసుకోలేరని భ్రమపడుతున్నారా? పిల్లి కళ్ళు మూసుకుని పాలుత్రాగుతూ, తన్ను ఎవరూ చూడడం లేదనుకుంటుందట! అలాగే ఉంది. "కామ్రేడ్సు" ధోరణి.

ఇక కమ్యూనిస్టుపార్టీ నిర్మాణ పద్ధతులు ఎలా ఉన్నాయో చూదాం.

"పార్టీ నిర్మాణం" (చండ్ర రాజేశ్వరావు) ప్రజాశక్తి ప్రచురణ నెం 58 మార్చి 1944) అను పుస్తకంలో (పేజీ 88, 89 లో ఇలావున్నది.

"నీతినియమాలను పోగొట్టుకొని, అడ్డెబండ్లుగా తయారై యున్న ఈరౌడీమూకలను కొంతమంది గ్రామపెత్తనదార్లులేమ

క్రింద చేర్చుకొని, తాగుడు, జూదం, వగైరాలను ప్రోత్స హించి ప్రజలమీద తమ ప్రతికక్షులయిన యితర పెత్తందార్ల మీద, దౌర్జన్యం ప్రయోగించి గ్రామ పెత్తనాన్ని చేజిక్కిం చుకుంటున్నారు. రౌడీమూకను ఉపయోగించని పెత్తనదార్లు, రౌడీల మూకకు నాయకత్వం వహించిన పెత్తనదార్లకు, లొంగిపోవడమో, లేక గ్రామరాజకీయాలలో జోక్యంపట్టించు కోకుండా దూరంగా ఉండడమో జరుగుతోంది. ఈవిధంగా నాజీదళాలను పోలిన ఈరౌడీమూకలకు నాయకులయిన పెత్తన దార్ల ఫాసిస్టు పరిపాలన క్రిందకు కొన్నిగ్రామాలు వచ్చివేసి నాయి. ఈపెత్తనదార్లు పంచాయితీబోర్డులు, కో ఆపరేటివ్ సొసైటీలు, పంచాయితీకోర్టులు, మొదలైన వాటిని స్వాధీనం చేసుకొని, అనేకవిధాల ప్రజల జుట్టును చేతిలో యిరికించుకొని కూర్చున్నారు. యిటువంటి గ్రామాలలో మన పార్టీ సభ్యులు ఆరౌడీ మూఠాయొక్క దౌర్జన్యాన్ని ప్రతి దౌర్జన్యంతో ఎదు ర్కోవాలి. అప్పుడే రౌడీముఠా అంటే భీతిజెందిన ప్రజాసా మాన్యాన్ని క్రమంగా ఆకర్షించగల్గుతాం. మనము ఈదౌర్జ న్యాన్ని ఎదుర్కోకుండా మనం ఎన్ని ధర్మపన్నాలు చెప్పినా ప్రజలు మనవైపురారు. మనం ఆరౌడీమూకను దౌర్జన్యం ద్వారా పూర్తిగా ప్రజాబలంతో అణచి వేసినప్పుడే గ్రామ నాయకత్వం మనచేతుల్లోకి వస్తుంది. ఈ రౌడీమూకను ఎదు ర్కోవడంలో కోర్టుల చుట్టూ తిరిగినా, క్రిమినల్ కేసులలో జైళ్ళకు వెళ్ళవలసివచ్చినా మనం ఏమీ, చింతించ అవసరం

లేదు. ఎక్కడయితే మన కామ్రేడ్సు ఈ రౌడీమూకను దౌర్జన్యంతో ఎదుర్కొంటూ వచ్చారో, అక్కడ మనపార్టీ బలపడింది. లేనిచోట్ల ప్రజలకు మన మంటే అభిమానమున్నా, చేతగాని వారమనే అభిప్రాయంతో ఉండి మనకు దూరంగా వున్నారు.''

ఆంధ్రదేశంలో రౌడీ గ్రామాలున్నాయనే విషయం మాకు తెలియదు. అయితే; ప్రతి గ్రామంలోను కొన్ని దురలవాట్లకు లోనయినవారు ఉంటే ఉండవచ్చును. అలాంటి దురలవాట్లకు లోనయినవారిని రౌడీలని, నాజీ దళాలని అనము. అలాంటివాళ్ళ సంస్కరించి, దురలవాట్లను లేకుండా చేయడం సంఘ శ్రేయోభిలాషుల విద్యుక్తధర్మం. కాని కమ్యూనిస్టులు తమపార్టీ వ్యతిరేకులను రౌడీలని పేరుపెట్టి, దౌర్జన్యంతో వారిని అణిచివేయాలని వూహుకున్నారు. "కామ్రేడ్సు" దృష్టిలో రౌడీలంటే జాతీయ యువజనులు, జాతీయ విద్యార్థులు, రంగా రైతుసంఘంవారు, కాంగ్రెసు వర్కర్లు వేయేల, తమ పార్టీని వ్యతిరేకించేవారంతా, వారు గ్రామపెత్తనదార్లయినా కాంగ్రెసు వారయినా, రౌడీలకు ప్రోత్సాహ మిచ్చేవారే! అయ్యా, కమ్యూనిజం పేరుతో 'రౌడీజం' పార్టీ సభ్యులకు బోధిస్తూ క్రిమినల్ కేసులయినా ఫర్వాలేదంటున్నాడు. ఇలాంటివారు పెద్దమనుష్యులో, చౌకబారు నజ్జుగా ప్రవర్తించే వార్లో గమనించాలని హెచ్చరిక చేస్తున్నాము!

'పార్టీనిర్మాణము' (పేజీ 135 లో) ఏమంటున్నదో చూదాం "కాని ప్రస్తుత సమాజ విధానంవల్ల త్రాగుడు, వ్యభిచారం, జూదం, మొదలైన దురలవాట్లు ప్రజల్లో వున్నవి. ప్రజాపార్టీ అయిన మనపార్టీలోగూడ చుట్టువట్లఉన్న ఈ వాతావరణం కొంతవరకు ప్రతిబింబించడం అసాధ్యంకాదు. అందువల్ల పార్టీలోగూడ కొద్దిమంది, పైదురలవాట్లు ఉండీ కూడ, పార్టీలో శ్రద్ధగా పనిచేసేవా రుండడం అసంభవం కాదు."—"పై దురలవాట్లు కొద్దికొద్దిగా ఉన్న వారందర్నీ పార్టీనుంచి తీసివేయడమంటే పార్టీ దెబ్బతింటుంది— "ఇలా తీసివెయ్యడం సంస్కరణతత్త్వం అవలంబించడ మన్నమాట"

"త్రాగుడు, వ్యభిచారం, జూదం మొదలైన దురలవాట్లు" కొద్దికొద్దిగా పార్టీ సభ్యుల్లోవున్నా, అలాంటివారికి పార్టీలో స్థానమున్నదని వ్రాసుకున్నారు. పైగా అలాంటి దురలవాట్లు లేకుండా చేయడానికి ప్రయత్నించడం సంస్కరణ తత్వమాట. అయితే, దురలవాట్లను సహించడం, విప్లవ తత్త్వమా? అయితే, లెనిన్ మహాశయుడు "ప్రతికమ్యూనిస్టు తన శత్రువుచేకూడ ప్రేమించ బడేలా నిష్కల్మషంగా ప్రవర్తించాలి" అన్నారు. గాంధీజీకూడ వ్యక్తి జీవితాన్ని సంస్కరించుకోవాలని ఆదర్శప్రాయంగా వుండాలన్నారు. అవును. లెనిన్ గాంధీజీ సంస్కరణవాదులు నేటి 'కమ్యూనిజం' రాజేశ్వరావు నిజమేకాబోలు. "పార్టీనిర్మాణం" (పేజీ 134)లో ఇలా వున్నది. "భార్యాభర్తలు పార్టీలో ఉన్నప్పుడు భర్తను

పార్టీనుండి తీసివేస్తే, భార్య భర్తకు విడాకులివ్వడానికి వేరుగా వడానికి తయారు కావాలి..." పెండ్లిగాని స్త్రీ పార్టీసభ్యులు పార్టీసభ్యుడు కానివాన్ని పెండ్లి చేసుకోకూడదు.

స్త్రీ స్వాతంత్ర్యము సమకట్ట వూనుకున్న కామ్రేడ్సు ధోరణి. ఆహా! వ్యక్తి స్వాతంత్ర్యము! రాజకీయ భావాలు వేరైనంత మాత్రాన, దాంపత్యము భగ్నము కావలసిందేనా? "కల్చర్ అంటే ఇలావుండాలి! మహాప్రభూ! గవర్నమెంటు వారి విడాకుల చట్టంలో ఈ క్లాజుకూడ చేర్పిస్తారా? మీ గవర్నమెంటులో అలాగే చేస్తారేం? ప్రేమ, అనురాగము ఇవ్వన్నీ భిన్న రాజకీయ అభిప్రాయా లున్నంత మాత్రాన కట్టుబడి పోతాయా? పార్టీ సభ్యురాలయిన స్త్రీ, పార్టీ సభ్యుడు కానివాణ్ని, ప్రేమించి, పెండ్లి చేసుకుంటే, నేరమేనా? ఔరా? 'ఆనవరూల్సు' "లోయ్యమనుష్యులు" ఆహా ఎలా వ్రాస్తున్నారు. (పార్టీ నిర్మాణం. 145 పేజి)

"కమ్యూనిస్టు పార్టీకి బద్ధ విరోధులయిన గ్రామపెత్తన దార్లతోను, రంగా గ్రూపుతోనూ, కాంగ్రెసు సోషలిస్టులు, రాయిస్టులు, ఫార్వర్డుబ్లాకు, ట్రాట్స్కీయిస్టులతో ఎటువంటి దగ్గరసంబంధం పెట్టుకోకూడదు, అలాసంబంధం పెట్టుకోవడం పార్టీ శిక్షణకు వ్యతిరేకం. ఒకరి యింటికి ఒకరు వెళ్ళుతూ రాసుకు, పూసుకు తిరుగకూడదు. ఏమైనా అవుసరమైన వ్యవహారాలుంటే, బిజినెస్ లైక్‌గా మాట్లాడాలి. వారిని ప్రజలు ద్వేషించేలా చేయాలి. అలా చెయ్యాలంటే, మనమే వారిని

ఆచరణలో ద్వేషించడం చూపించాలి." ఇదివరకు యూరప్ లో వివిధ మతాలకు చెందినవారు ఒకరినొకరు ద్వేషించుకొని చివరకు ఒకరినొకరు హత్యలు చేసుకోడం, తగులబెట్టుకోడం జరిగిందని చరిత్రలో చదివాం. అలాగే జర్మనీ, ఇటలీ, రష్యా లాంటి దేశాల్లో రాజకీయ పార్టీలు తీవ్ర ద్వేషాలకు పాలయి హత్యలు గావించుకోడం జరిగింది. మన దేశంలో కూడ ఇలాంటి అంతర్యుద్ధాన్ని తెచ్చిపెట్టి, రాజకీయ రంగంలో హత్యాప్రకాండను ప్రవేశ పెట్టుటకు పూనుకుంటున్నారు. వీరి 'శంచు కాగడా' కూడ ఇలా తీవ్ర వ్యక్తి దూషణకు, ద్వేషమును తెచ్చిపెట్టి హత్యలు మున్నగు దౌర్జన్య చర్యలకు నాందియే. రాజకీయ అభిప్రాయ భేదాలుంటే ఒకరినొకరు ద్వేషించుకోవాలనడం మానవత్వాన్ని మంట గలుపడమే.

పార్టి నిర్మాణంలో ద్వితీయ భాగం 20వ పేజీలో యిలా ఉన్నది. "ప్రతిఘటకులు ముఠాగా చేరినచోట, ఆ ముఠావారు అల్లరి చేస్తాంటే చుట్టూ వాలంటీర్లను నిలబెట్టి వారిని కదలకుండా చూడాలి. ప్రజల్లో వారిని రౌడీలుగా బట్టబయలు చేసి, వారిని అసహ్యించుకొనేలా చేసి, అటుతర్వాత వారిని మీటింగు నుంచి నెట్టివేయాలి వారిదృష్టిలో నభలలో సందేహాలు తీరిపోడానికి ప్రశ్నలు వేసే వారంతా రౌడీలే. ఇలా సందేహాలకు రాజకీయంగా సమాధానాలు చెప్పలేక ప్రజలపై లాఠీలతో విరుచుకపడటం వారికి పరిపాటి అయిపోయింది. ఇలా ఆంధ్ర దేశంలో అనేక చోట్ల దెబ్బలాటలకు దిగారు ఉదాహరణకు

బెజవాడ, తెనాలి, అనంతపురం. గుడివాడ, గుంటూరు, పొన్నూరు, పాములపాడు రైతుసభ, చినవోగిరాల, ఇలా మొత్తం 47 చోట్ల కమ్యూనిస్టులు ప్రజలపై దౌర్జన్యంలో విరుచుకపడ్డారు. ఈరోజుకి కోర్టుల్లో ఒక్క కృష్ణాజిల్లాలో 6 కి పైగా క్రిమినలు కేసులు ప్రజలకు కమ్యూనిస్టులకు జరుగుతున్నాయి.

ఈవిధంగా ప్రజలను భయపెట్టి, తమకు ఎదురు లేకుండా చేసుకుందామని ముమ్మరిప్పలుపడుతున్నారు. ఇంత వరకు ఏ రాజకీయపార్టీ కూడ మన దేశచరిత్రలో ఇలాంటి దౌర్జన్యాన్ని ప్రజలపై ప్రయోగించలేదు ఇలాంటి దుండగీండ్రు చేసేవారు రకం, 'సత్యఅహింస, సాంప్రదాయాలతో పుట్టిపెరిగిన కాంగ్రెసులోనే మేమూ వుంటామంటారు.

గాంధీజీకి ఆంధ్ర రాయబారం

గాంధి, రాజేంద్రప్రసాద్, పటేల్ గార్లపై యుద్ధయత్నభగ్న నిందారోపణ జేస్తూ కమ్యూనిస్టులు దేశంలో సాగించిన దుష్ప్రచారాన్ని డాక్యుమెంటుల ఆధారంపై, పంచగనిలో ఇటీవల రాయబారంలో తెలియ జేయడమైనది.

ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెసురాయబారవర్గంవారు మహాత్మునకు సమర్పించిన మెమోరాండంలోని అంశములు ఆంధ్రపత్రిక (ఆగస్టు 18, 1944)

కాంగ్రెసు 1942 ఆగస్టు అల్లరుల బాధ్యత

కమ్యూనిస్టుపార్టీవారు 1942 ఆగస్టు అనంతరం జరిగిన అల్లరులకు కాంగ్రెసుకు సంబంధం లేదని, ఒకచోట, కాంగ్రెసునాయకత్వానికి అరాజకకార్యాలకు పూర్తిసంబంధం ఉందని మరొకచోట వ్రాస్తూ ప్రజలలో అనుమానాలకు శంకలకు తావిచ్చారు. ఇందుకు నిదర్శనంగా 1942 సెప్టెంబరు 3, 4 తారీఖులలో కమ్యూనిస్టుపార్టీ వారు బొంబాయిలో సమావేశమైనప్పుడు అధికారి యిచ్చిన రిపోర్టు వివరాలు "ప్రజాశక్తి ప్రచురణ, 7 అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీ సమావేశం" అనే పేరుతో, ఆంధ్రదేశంలో వెలువడిన పుస్తకంలోని ఈక్రిందివిషయాలు సాక్ష్యమిస్తాయి.

"అఖిలభారత కాంగ్రెసుకమిటీలో రెండు ముఠాలున్నవి. మొదటి ముఠాకు చెందిన నెహ్రూ, ఆజాదులు ఫాసిస్టు వ్యతిరేకులు, రెండవముఠాలో గాంధీ, పటేల్, రాజేంద్రప్రసాద్, లున్నారు. వీరు దేశరక్షణ కార్యాలను భగ్నపరచటం ద్వారానే స్వరాజ్యం వస్తుందని వాదించువారు, నమ్మినవారు, అఖిలభారత కాంగ్రెసు కమిటీలో స్పష్టమైన కార్యక్రమమేదీ యివ్వబడనందున, అటుపిమ్మట జరిగిన ఘటనలన్నీ వట్టి అరాజక చర్యలేననీ, కాంగ్రెసు నాయకత్వానికి, వీనికీ ఎట్టి సంబంధం లేదని కొందరు భావిస్తున్నారు.

ఇది సరికాదు. మొదటి రెండురోజులలో జరిగిన ఘటనలన్నీ వట్టి అరాజక చర్యలని చెప్పవచ్చు. కాని అటు పిమ్మట

అందులో కొంతరు ప్రవేశించి, దానికి స్పష్టమైన రూపం యిచ్చారు, కాంగ్రెసు కమిటీలో రెండవముఠాకు చెందిన రాజేంద్రప్రసాద్, పటేల్, గాంధీజీ మున్నగువారు సూచించిన స్వరూపమే దేశంలో వ్యాపించింది. దీని ఎత్తుగడలు, రహదారీ సౌకర్యాలను భగ్నపరచడం, ఉత్పత్తిని స్తంభింప చేయడం"

"ఈ పోరాటం రాజకీయ జూదం" (ప్రజాశక్తి ప్రచురణ 7 పి. సి. జోషి) పొలిటికల్ సర్క్యులర్ నెం 12 కమ్యూనిస్టుపార్టీ సభ్యులకు మాత్రమే. అనేదానినుంచి సంగ్రహించిన విషయాలు. "ఆంధ్ర, మలబార్ జిల్లాలలో కాంగ్రెసు వాదులందరినీ యిదివరలో పంచమాంగదళమని ప్రచారం చేశాము డాక్యుమెంట్సు చూపించలేక పోయాము. రుజువు చేయలేక పోయాము. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ వారిని. ఫార్వర్డు బ్లాకుని పంచమాంగ దళమని ప్రచారం చేయాలి.

"సర్క్యులర్ నెం 3 పార్టీ సభ్యులకు మాత్రమే" అనే దానిలో ఉదహరించబడిన విషయాలు; "ఏయే గ్రామాలలో ఎంతమంది కాంగ్రెసువాదులున్నారు. వారి పలుకుబడి ఎటువంటిది. తగ్గించడానికి ఏమి చేయాలి? పూర్తి అడ్రసులతో పంపండి"

1937 సెప్టెంబరు కమ్యూనిస్టు పత్రికలో ఈ క్రింది విధంగా వ్రాయబడినది.

"సంస్కరణవాదులు, జాతీయవాదులు చేతులలో యున్న సంఘాలలో చేరి వారిలో నిత్యము పోరాటంసల్పుతూ వారి పలుకుబడిని తగ్గించండి. వారి చేతులలో నుండి జనసామాన్యమును తప్పించి, కమ్యూనిస్టుపార్టీ వైపుకు మరల్చండి. గాంధీ తత్వమును బహిరంగముగా గాని, రహస్యముగా గాని, బలపర్చువారు పార్టీనుండి తొలగింప బడుదురు."

(18—8—44, ఆంధ్రపత్రిక)

# ౧౦

# ఏది విప్లవ పంథా?

ద్వితీయ ప్రపంచ సంగ్రామం 6 సంవత్సరాలు ప్రపంచాన్ని కల్లోలపరచి అంతమయింది, ఆహాకారాలు, ఆర్తనాదాలు అంతమయినాయి. ఎట్టకేలకు శాంతి సంప్రాప్తించింది. తుపాకుల టపటపలు, ఫిరంగుల ఫెళఫెళలు, టాంకుల ధణధణాలు, విమానాల ఝంకారాలు సమసిపోయాయి. ప్రజలు నిట్టూర్పులు విడిచారు యుద్ధభీభత్స్యాన్ని అంతంచేయడానికి, శాంతినెలకొల్పడానికి, ఎంతజన, ధన, సాధనసంపత్తి ఆహుతిచేయబడిందో ప్రజానీకం గ్రహించినట్లే వుంది. అంతేగాకుండా యీమారణహోమానికి దారితీసిన దోపిడీవిధానం, బూర్జువావర్గపు దురహంకారం, సామ్రాజ్యవాదుల దురాశలు, తుదముట్టాలని ఆందోళన బయలుదేరింది. శాంతి, స్వాతంత్ర్యము, అవిభాజ్యమైనవి. పరస్పరం ఆధారభూతాలు. 'ఏకప్రపంచ' మంటే ఏమిటో అర్థమవుతోంది.

శాశ్వితమయిన శాంతిసమరం కూడాలంటే ప్రజాస్వామికం ఎండమావులవలెగాక యథార్థమయిన సామాజిక జీవితంలో ప్రత్యక్షమవ్వాలి.

బ్రిటనులో ప్రజలు లేబరుగవర్నమెంటు ఏర్పరచుకున్నారంటే, ప్రజల చైతన్యం ఏస్థాయిలోవుందో అర్థమయింది.

ఒక్క బ్రిటనులోనే కాదు, యూరప్ అంతటిలోనూ ప్రజాస్వామిక భావాలు ఎలా రూపొందుతున్నాయో గోచర మవుతోంది. యూరప్‌లో అతివాదపక్షాలకే విజయం చేకూరడం తథ్యం. యూరప్‌లో సుస్థిరమయిన శాంతి ఏర్పడాలని ప్రజలు ఆశిస్తున్నారు. సామ్రాజ్యవాదం సర్వనాశనం అయితేగాని అలాంటి శాంతి సమకూడదు. అంతిమవిజయం ప్రజలదయినప్పుడే అలాంటి శాంతి సంప్రాప్తిస్తుంది.

**బ్రిటిషు లేబర్ పాలసీ**

అలాంటి శాంతిని బ్రిటిషు లేబరు సమకూర్చగలదా? లేబరుపార్టీ పాలసీ ఎక్కడకు దారితీస్తుంది? యూరప్‌లోనూ, ప్రపంచంలోనూ దానిపాత్ర ఎలాంటిది?

లేబరుగవర్నమెంటు విదేశాంగ కార్యదర్శి మిష్టర్ ఎర్నెస్ట్ బెవిన్ పార్లమెంటులో 20 ఆగస్టు 1945 లో యిలా సెలవిచ్చారు. "ప్రపంచయుద్ధంలో మా ప్రజలు చేసిన అసమాన్య త్యాగాలను స్మరణలో వుంచుకొని తగినవిధంగా మాత్రమే మన విదేశాంగ రాజనీతిని సరిదిద్దుకుంటాను" బెవిన్ ఈమాటలు అన్నప్పుడు పార్లమెంటుసభికులు కరతాళధ్వనులు చేశారు. ఆ ఉపన్యాసకుడు ఆమాటలు ఏ దృక్పథంతో అన్నాడో, చప్పట్లుకొట్టిన పెద్దమనుష్యులు అర్థం చేసుకున్నారా యని ఆశ్చర్యం గలుగుతోంది. అదేధోరణిలో బెవిన్ యిలా అన్నాడు. "హాంగ్ కాంగ్ లో జపాను సైన్యాలు లొంగిపోవటాని

మన సైనికులు అంగీకరించడానికి'' — మనకు అనేక కష్టాలు రావచ్చును. కాని అవన్నీ తొలగిస్తాము. మన అమెరికా, చైనా, మిత్రుల సహకారంతో మనప్రాంతాలన్నీ ఆక్రమించు కుంటాము'' బ్రిటిషు లేబరు విదేశాంగ రాజనీతి ఎలాంటిదో పైమాటలు సువ్యక్తం చేస్తున్నాయి. సందేహానికి ఏమీ ఆస్కారం లేదు. నిరాశాపూరితమయిన నిట్టూర్పులతో మనం ఆమాటలు అర్థంచేసుకున్నాం.

ఇంతేకాదు. గ్రీసు దేశం విషయంలో 'పాడిందే పాటరా పాసిపళ్ళదాసరి' అన్నట్లుగా కరుడుగట్టిన కన్సర్వేటివ్ చర్చిల్ వైఖరికే లేబరుగవర్నమెంటూ అనుసరించింది. 'శాంతి-భద్రతలు' పేరుతో యూరప్‌లోని ప్రతిఘటనాశక్తులను ఎదుర్కొన్నారు. యూగోస్లేవియా, బల్గేరియా, రుమేనియా, హంగేరి, దేశాలపట్ల లేబర్ గవర్నమెంటు వైఖరి జగద్విదితమే కదా! 'ప్రజాస్వామికత' పేరుతో సోవియెట్ రష్యాపై బ్రిటిషుశక్తినంతా కేంద్రీకరించాలని ప్రయత్నాలు ప్రారంభించారు. బ్రిటిషు 'ప్రజాస్వామికత' గ్రీసులోనే నిజస్వరూపంతో కన్పించింది.

**కమ్యూనిస్టు వైఖరి**

ప్రపంచంలో ప్రజాపరిపాలన, సుస్థిరమయిన శాంతి, ఆశయాలుగా ప్రకటించి యుద్ధాన్ని సాగించిన బ్రిటిషు వారి వైఖరి అలా వుంది.

''పీడితప్రజల విముక్తియుద్ధం''—ప్రజాయుద్ధం ఎలాంటి ఇలాంటి ఫలితాలనే యిచ్చింది, బ్రిటిషు యుద్ధప్రయత్నాలకు

సంపూర్ణసహాయం ఇందుకేనా చేయుమన్నది. సామ్రాజ్యవ్యతిరేక ఐక్యసంఘటన విరమించమన్నది ఇందుకేనా? స్వాతంత్ర్య పోరాటం సాగించకూడదన్నది. దీనికేనా? జాతీయప్రభుత్వం—కాంగ్రెసు, లీగు ఐక్యత మున్నగు దగాకోరు నినాదాలు ఎలా నిరర్థకమై రుజువయి పోయింది, సత్వర స్వాతంత్ర్య సాధనకై విప్లవం సాగించడమే విముక్తి ధర్మమయింది. భారతప్రజల స్వాతంత్ర్యయుద్ధాన్ని, పిచ్చితనమని, గూండాతనమని అనటం ఎంత పొగరుబోతుతనము. విప్లవమూర్తులు, త్యాగధనులు, అయిన సోషలిస్టులను పంచమాంగదళమని తూలనాడుట ఎంత దుడుసుతనం! భారతప్రజల ధైర్యసాహసాలు అపూర్వము, అత్యద్భుతము. భారతకమ్యూనిస్టులు ప్రభుత్వ సహాయసంపత్తులతో ఎన్ని అవరోధాలు కల్పించినా ప్రజలు చలించలేదు. 1943 సెప్టెంబరు నెల 20 వ తేదీన సర్ రిచర్డుటాటెన్ హోమ్ ప్రభుత్వోద్యోగులకు ఒక సర్క్యులర్ జారీచేస్తూ, కమ్యూనిస్టులతో సహకారము చేసి, వారికి సహాయములను చేయాలని కోరలేదా? అప్పుడప్పుడు కమ్యూనిస్టులు గవర్నమెంటును దూషణగా మాట్లాడేది ప్రజలను మోసగించి పార్టీ బలాన్ని సంపాదించ చేసుకోడానికేనని ప్రభుత్వం అర్థం చేసుకొంది. 1942 ఆగస్టు ప్రజావిప్లవంలో ఇలాంటి ద్రోహం కమ్యూనిస్టులు చేశారు.

మార్క్స్ మహాశయుని పేరునకు కూడ కళంకం తెస్తున్నారు. భారతకమ్యూనిస్టులు ఇలాంటిపరిస్థితులలో నేమార్క్స్

ఏమి చేసాడో చూడండి! 1871 సంవత్సరంలో ఫ్రెంచి తిరుగు బాటులో మార్క్స్ మహాశయుని మహత్తర పాత్రను వివ రీకరిస్తూ, విప్లవ ఎత్తుగడలను చర్చిస్తూ కారల్ మార్క్స్ ఉప దేశాలు అను ఉద్గ్రంథంలో లెనిన్ ఇలా అన్నాడు.

అంతర్జాతీయ కార్మిక మహాసభ తరఫున కారల్ మార్క్స్ 1870 సెప్టెంబరు 9 తేదీన ఫ్రెంచి శ్రామికవర్గానికి సమయం కాని సమయంలో తిరుగుబాటు కూడదని హెచ్చరించాడు. కాని, 1871 లో ఫ్రెంచి ప్రజలు తిరుగుబాటు చేసారు. అప్పుడు మార్క్స్ ప్రజానీకపు విప్లవచైతన్యాన్ని అభినందిం చాడు. భూనభోంతరాలు దద్దరిల్లి పోతున్నాయన్నాడు. ఇలాం టిపరిస్థితులలో, విప్లవశక్తులు ఓడిపోయినా, మార్క్స్ దృష్టిలో తా లవ్రీకారం, పిరికితనంతో కూడిన లొంగుబాటుకంటే మంచి దే లొంగుబాటు పోరాటశక్తుల్ని పతనం చేస్తుంది. విప్లవం పోరా టశక్తుల్ని విజృంభింప చేస్తుంది''

ఈ పై వాక్యాలు 1942 ఆగస్టు విప్లవం ఎలా సమర్థ నీయమో వెల్లడి చేస్తున్నాయి. ప్రజాపోరాటశక్తుల లోతు పాతులు అర్థమయితే కమ్యూనిస్టులు అలాచేయరు. రష్యన్ జాతిలో వారి దృష్టిని ఆటంకపరిచింది. భారత ప్రజలు తన యులయి దేశభక్తిలో తేలిపోతున్న సమయంలో కమ్యూని స్టులు జవహార్‌లాల్ నెహ్రూ అన్నట్లుగా ప్రభుత్వపక్షంతో వున్నారు. జాతీయత అంటే ఏమిటో అంతర్జాతీయత అనలేమి

టోపస కమ్యూనిస్టు ఇన్స్ట్రుతులకు లేకపోవ పట్టలేదు. అందువల్లనే ఇలాంటి తప్పుడు పంథా త్రొక్కేరు

**శాస్త్రీయమైన సోషలిజం**

1920 నుండి 30 వరకు కమ్యూనిస్టుల ఇలాంటి అపకతవకలు, జాతీయవ్యతిరేక పోకడలు, మార్క్సిస్టుసూత్రాలను తప్పుగా అన్వయించడం మొదలయినపనులవల్ల — భారతజాతీయప్రజాస్వామిక విప్లవాన్ని మార్క్సిస్టు విప్లవ ఎత్తుగడలతో సాగించడానికి లేక మార్క్సిస్టుపార్టీ భారత భూమిలో సోషలిజాని స్థాపించడము ఆశయముగా పెట్టుకొని ప్రారంభమయింది. 1932 శాసనోల్లంఘనోద్యమము విఫల మయిన తర్వాత ఇలాంటి సోషలిస్టుగ్రూపు మరింత అవసర మయింది. వర్గచైతన్యము పెంపొందింపచేసి కార్మికవర్గాని ఏకంచేసి, జాతీయప్రజాస్వామికశక్తులలో సముచితమయిన స్థానాన్ని సంపాదించి — అంటే, జాతీయ కాంగ్రెసులో అంత ర్భాగంగా ఉంటూ పనిచేయడానికి పూనుకోవలసివచ్చింది జాతీయసంఘుటనంలో కార్మికవర్గసంఘుటన నిర్మించడానికి ప్రయత్నించడమయింది. ట్రేడ్ యూనియన్ ఐక్యత సాధించ బడింది. ఈవిధంగా కమ్యూనిస్టుల జాతీయ వ్యతిరేకపంథా ఎదుర్కొనబడింది. సంఘటితసోషలిస్టు ఉద్యమానికి పునాదులు వేయబడ్డాయి.

శ్రీ జయప్రకాశ్ నారాయణ నాయకత్వాన కాంగ్రెసు సోషలిస్టుపార్టీ ఈకార్యభారాన్ని వహించింది.

**కాంగ్రెసు సోషలిస్టులు**

1942 ఆగస్టు విప్లవంలో విరోచితమయినపాత్ర వహించారు. కాంగ్రెసు పేరు ప్రతిష్టలు కాపాడారు.

కమ్యూనిస్టులు 1942 ఆగస్టు తదనంతరం కాంగ్రెసుపేరుతో వలుకుబడి సంపాదించాలని ప్రయత్నిస్తూ, కాంగ్రెసునకే గోతులుత్రవ్వ నారంభించారు.

కాంగ్రెసునాయకుల విడుదల అనంతరం కమ్యూనిస్టులపైవచ్చిన రిపోర్టులు పరిశీలించారు. కాంగ్రెసుక్రమశిక్షణ ఉల్లంఘించినందులకు కమ్యూనిస్టులను కాంగ్రెసుకమిటీలలో ఎన్నికస్థానాలకుమాత్రమే అనర్హులని ప్రకటించారు. పావలా సభ్యులుగా చేరడాన్ని నిషేధించలేదు. కాని కమ్యూనిస్టుపార్టీ వారే కాంగ్రెసులో పావలాసభ్యులుగాకూడా చేరకుండా వున్నవారంతా రాజీనామా యివ్వాలన్నారు. ఈవిధంగా జోషీ అండ్ కంపెనీవారు జాతీయకాంగ్రెసును బహిష్కరించారు. జాతీయోద్యమంలోనుండి నిష్క్రమించారు. పైపెచ్చు కాంగ్రెసులో జమీందారులు, ధనికులు, భూస్వాములు ప్రాబల్యంలోవున్నారుగనుక తాము రాజీనామా యిచ్చామన్నారు. కాని మహమ్మదీయ కమ్యూనిస్టులు ముస్లింలీగులో చేరారు. ముస్లింలీగులో జమిందారులు, భూస్వాములు, ధనికులు లేరా?

ముస్లింలీగు, జాతీయకాంగ్రెసుకంటే అభివృద్ధికరమైన సం స్థయా? అంతేకాదు, అంబేద్కర్ నాయకత్వానవున్న నిమ్న జాతుల ఫెడరేషనులో హారిజనకమ్యూనిస్టులంతా చేరారట. అంటే కాంగ్రెసుకంటే అంబేద్కర్ విప్లవవాదియా?

ఎన్నికలలో కాంగ్రెసుకు పోటీగా కమ్యూనిస్టులు అభ్యర్థులుగా నిలుస్తున్నారు. అంతేకాదు జాతీయముస్లింఅభ్యర్థులను వ్యతిరేకంగా ముస్లింలీగు అభ్యర్థులను బలపరుస్తున్నారు. కాంగ్రెసు, హారిజనఅభ్యర్థులకు వ్యతిరేకంగా అంబేద్కర్ అభ్యర్థులను బలపరుస్తున్నారు. ఇదంతా దేనికొరకో తెలుసునా?

కాంగ్రెసు - లీగు - కమ్యూనిస్టుఐక్యత సాధించడానికే సుమా? జాతీఐక్యతనే పరమావధిగా పెట్టుకొని పనిచేస్తున్నారట! బాగానేవుంది! ఐక్యతకావాలసిందే. అయితే కమ్యూనిస్టులకార్యక్రమం ఐక్యతకు దారితీస్తుందా? ఆచరణలో వారి పంథా ఎక్కడికి దారితీస్తుంది?

రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యక్రమానికి, కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమానికి అన్నిప్రధానవిషయాలలోను పోలిక వున్నది. చూడండి. రాడికల్స్ మార్క్సిజమే ప్రమాణంగా భావిస్తారు. కమ్యూనిస్టులు అంతే వారు కమ్యూనిజమే ధ్యేయంగా పెట్టుకున్నారు. వారు అంతే! వారు యుద్ధాన్ని ప్రజాయుద్ధమన్నారు. లీగు అలాగే అన్నారు. రాడికల్ కాంగ్రెసులో సభ్యులుగా చేరారు. కమ్యూనిస్టులు చేరారు. రాడికల్స్నాయకుడు యం. యన్. రాయిగారు కాంగ్రెసు

ఫాసిస్టుసంస్థన్నాడు. కమ్యూనిస్టునాయకుడు పి. సి. జోషీగారు కాంగ్రెసులో ఫాసిస్టుపోకడలు పొడచూపుతున్నాడు. ఇన్ని పోలికలున్నాయి. అయినా రాడికల్స్ — కమ్యూనిస్టులు ఏకం అయ్యారా? అందుకు ఐక్యతనే పరమావధిగా పెట్టుకొని పని చేస్తున్న కమ్యూనిస్టులు పనిచేసారా? లేదు. పైపెచ్చు రాడికల్స్‌పై దుమ్మెత్తిపోస్తున్నారు. వారుచేసిన నేరమేమిటి? నాకు తెలిసినంతవరకు ఇక ఆరునెలలకు కమ్యూనిస్టులు ఏంచేస్తారో, ముందుగా యం. యన్. రాయి అదిచేస్తాడు.

1. ఉదహారణకు కాంగ్రెసులో రాడికల్స్ ఉండకూడదని యం. యన్. రాయి తనఅనుచరు లందరిచేతా రాజీనామా లిప్పించి కాంగ్రెసుపై కత్తికడితే, జాతీయవిద్రోహి రాయి అన్నారు కమ్యూనిస్టులు. ఈనాడు కమ్యూనిస్టులు చేస్తున్న దేమిటి? ఆజాతీయవిద్రోహమేగా?

2. కాంగ్రెసునాయకత్వం ఫాసిస్టునాయకత్వమన్నాడు యం. యన్. రాయి అదితప్పు. గవర్నమెంటు ఏజెంటురాయి అన్నారు కమ్యూనిస్టులు. ఈనాడు పి. సి. జోషీ కాంగ్రెసులో ఫాసిస్టుపోకడ లున్నాయంటున్నాడు! — ఈవిధంగా జోషీ అండ్ కంపెనీవారు జాతీయవిద్రోహపంథా నవలంబించారు.

జాతీయకాంగ్రెసు జగత్ప్రసిద్ధినొందిన క్విట్ యిండియా తీర్మానాన్ని ఆమోదించి విప్లవకార్యాచరణకు దిగింది.

అంచేత, భారతపత్రికలు కాంగ్రెసు కమ్యూనిస్టు వైరుధ్యాలు, సంఘర్షణలు — స్వాతంత్ర్యానికి — బానిసత్వానికి మధ్య జరుగుతోన్న సంఘర్షణలుగా భావించి విప్లవకార్యక్రమాన్ని స్వీకరించి కాంగ్రెసు అడుగుజాడల్లో నడవాలని కోరుతున్నాం.





శాస్త్రముద్రాక్షరశాల, రాజమండ్రి. కాపీలు 2000.